# శ్రీకృష్ణ సంజయ

# రాయబారము.



గ్రంథకర్త,

పెనుమాక వీరప్ప.

శ్రీరస్తు.

# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు.

ప్రథమాంకము.

ధృతరాష్ట్రుడు.
భీష్ముడు.
ద్రోణుడు.
సంజయుడు.

ద్వితీయాంకము.

ధర్మరాజు.
భీముడు.
అర్జునుడు.
నకులుడు.
సహదేవుడు.
శ్రీకృష్ణుడు.
సంజయుడు

తృతీయాంకము.

ధృతరాష్ట్రుడు.
విదురుడు.
భీష్ముడు.
ద్రోణుడు.
సంజయుడు.
దుర్యోధనుడు.
కర్ణుడు

చతుర్థాంకము.

ధర్మరాజు
భీముడు.
అర్జునుడు.
నకులుడు.
సహదేవుడు.
శ్రీకృష్ణుడు.
ద్రౌపది.

పంచమాంకము.

ధృతరాష్ట్రుడు.
భీష్ముడు.
ద్రోణుడు.
విదురుడు.
శ్రీకృష్ణుడు.
సాత్యకి.
కుంతీదేవి.
కర్ణుడు.
దుర్యోధనుడు.
నారదుడు.
గాంధారి.
ఆకాశవాణి.

షష్ఠమాంకము.

ధర్మరాజు.
భీముడు.
అర్జునుడు.
నకులుడు.
సహదేవుడు.
శ్రీకృష్ణుడు.
సాత్యకి.

# శ్రీకృష్ణ సంజయ రాయబారము.

(ప్రథమాంకము.)

ఉ॥ "శ్రీవరనాదుభారము విశేషము దీర్పు" మటంచు నెంచి భూ
దేవి, నుతింపఁగాఁ గని యుధిష్ఠిరు పక్షము గోరి దేవకీ
దేవికి నుద్భవించి గుణధీరుల బ్రోవఁగ రాయబారియై
కేవల మేగినట్టి యలకృష్ణుఁడు సభ్యులఁ బ్రోచు గావుత॥

(నాంద్యంతమున)

(సూత్రధారుడు ప్రవేశించి సభవంకఁ జూచి)

ఏదియో మఱచితి. ఆ. జ్ఞప్తికి వచ్చినది. మహాశయ గుణగణాగరిష్ఠులైన యీ సభాసదులు శిష్టజన మనోభీష్టంబుఁ దీర్ప సర్వజనానంద కరంబొప్పు రసపూరితంబగు నొక్క నాటకము ప్రదర్శింపుమని నా కానతిచ్చిరి. కాని నాటకమేదైనది మఱచితి. అది జ్ఞప్తికి దెచ్చుటకు నామిత్రుఁడైనను రాకుండె. (అనియాలోచింపుచుండ)

మిత్రు॥ (ప్రవేశించి) ఏమోయీ! ఇంతలో నేనన్న దలంచుట.

సూత్ర॥ మిత్రమా! నిన్ను దలంచగానే నామఱపు కూడా నీతోనే వచ్చినది సుమా!

మిత్రు॥ అదియేమి చెప్పుము.

సూత్ర॥ ఈదినంబున శ్రీకృష్ణ సంజయుల రాయబారమను నాటకమునకుఁ దగిన పాత్రలాయత్తపఱచుమని నా కానతిచ్చిరి.

మిత్రు॥ ఏమీ శ్రీకృష్ణ సంజయుల రాయబారమా. ఆనాటకి మెవరు రచించిరి. ఆకథ యేప్రబంధములోనిది.

సూత్ర॥ అదియా. భారతప్రబంధము లోనిది.

మిత్రు॥ భారత ప్రబంధములోనిదా! అట్లయిన సరే. "తినా గారెలే తినవలె. వినా భారతమే వినవలె" నన్న లోకోక్తిగా చూడవలసిన నాటకమే గదా. ఆయ్యది యెవరు రచించిరో చెప్పుము.

సూత్ర॥ నీవెఱుంగవా యేమి?

సీ॥ శ్రీ సముంచితముగా భాసిల్లు కౌలాలి
కులజుండు నిత్యసద్గోష్ఠీపరుడు
చిరసార కౌశహస్త్రీస్వర గోత్రుండు
వరవెంకమాంబా సద్వంశజుండు
పలుసిల్లు వీరయాభిఖ్యుకుఁ గూర్మి పుత్రు
మాంగాక్షి శ్రోత్రియగ్రామవాసి
ఈశ్వరి బూరగాను యెల్లమందాంబ
మేయ శ్రేష్ఠు కరయు నిజాత్మజుండు
సుకులజు సత్యవిచంద్రుడు గుమ్మడివల్లి
బంగారుదాస కృపాయుతుండు

గీ॥ సత్యవిజయకు మహాగ్రంధ సత్యవిజయు
పార్థసారధి శ్రేష్ఠికి పరమహితుడు
నైన యెంగలి విశ్వాహ్వయుండనెడి కవియు
రచియించె మొనరించె బుధులొప్ప రమ్యముగను.

మిత్రు॥ ఓహో. అతఁడా! ఆ శ్రీకృష్ణ సంజయుల రాయ
బారము నాటకముగా నొనర్చినది. అట్లయిన సరియే.
ఇంకే లాలస్యము. పాత్రలాయత్త పఱచుము. లే
లెమ్ము.

సూత్ర॥ మిత్రమా. ఇదిగో కొంచెము ఋతువర్ణనము గా
వించి పాత్రలాయత్త పరచెదను.

మిత్రు॥ సఖా అటులనే కానిమ్ము.

సూత్ర॥ ఏఋతువును వర్ణించెదను?

మిత్రు॥ వసంత ఋతువునే.

సూత్ర॥ వసంత ఋతువునా! ఔనౌను. ఆఋతువు నందు
కొన్ని విశేషములు గలవు.

ఉ॥ ఎండినయట్టి మ్రాకులపయిం నిలువంబడి తాల్మిదూలియా
యండజ బృందమొక్కగతి నాశలువీడివసించు గూండ్లపై
నుంచు తెఱఁగె నవీన తరులోయన పల్లవముల్ జనించె నా
నిందు వసంతకాలమును నిక్కముగా మతియెన్న శక్యమే॥

మిత్రు॥ సూత్రికా! కాలయాపన మగుచున్నయది. సభ్యులు
ఇది యేనాటకమాయని, గుజగుజలాడు చుండెదరు.
ఇంక నీవుబోయి పాత్రలాయత్త పరచుము లెమ్ము.

(అంతట అందరు నిష్క్రమింతురు.)

బూనుకొనియున్నవారు కాన బలాబలంబులును ధర్మా ధర్మంబులును విచారించి సంజయుని పనుప నిశ్చయింపుడు.

భీష్మ॥ ధృతరాష్ట్ర మహారాజా! వారు ధర్మమునకు లోబడు వారుకాని యధర్మమునకు బొల్పడువారు కారు.

గీ॥ తను బలమ్ము మ పశుబల ద్రవ్యబలము
లొదవెనేనియు భూపతి కదన జయము,
దైవ బలమును నలుకాలి ధర్మఫలము
సాగనేటిదు లేకున్న సార్వభౌమ॥
కావున వారికి దైవబలమెక్కుడు.

ద్రోణు॥ అనవరతార్థి జనకల్పభూజా! ధృతరాష్ట్ర మహారాజా! భీష్ముని వాక్యంబంతయు నిజము. వారికి దైవబలం బెక్కుడె. కాకున్న చో

ఉ॥ నీదగు జ్యేష్ఠనందనుడు నీచవువత్తికి లోగ జంగి దా
యాదుల నెంచకే యిడిన యాపదలెన్నియొ నిప్పుడప్పుడే
భేదములేక నెత్తినిడి కృష్ణుడు వారికి దోడునీడగా
నీదుచునున్నయట్లు మనమింతకు మున్నె యెరుంగ మేస్పపా॥
కావున వారికి, దైవబలంబున నాపదలెన్ని చ్చినను గెల్చుచునేయుండు గాన వారి రాజ్యము వారికిమ్ము టదె వారిం బిలువనంపుటయే న్యాయభిప్రాయము

ధృత॥ సంజయా! యికనీవు పాండవుల పాలికి బోయిరమ్ము॥

సంజ॥ చిత్తము మాలాగునే పోయివచ్చెద.

(అందరు నిష్క్రమింతురు.)



# ద్వితీయాంకము.

(పాండవుల ప్రథమరంగము.)

ధర్మభీమార్జున నకుల సహదేవ కృష్ణుల ప్రవేశము.

ధర్మ॥ బావా! శ్రీకృష్ణదేవా! అనచ్చెడి మహనీయుం డెవరో విచారింపుము.

కృష్ణ॥ (ముఖావలోకనంబు చేసి) ధర్మతనయా! సంజయుఁడుగా దోఁచుచున్నయది

సంజ॥ (ప్రవేశించి) ధర్మతనయా! ఏను సంజయుఁడనువాఁడ. భవజ్జనకుండగు ధృతరాష్ట్రుండు తమ సమాచారంబు గనుంగొని రమ్మని పంప భవద్దర్శనార్థము వచ్చితి.

ధర్మ॥ సంజయా!

గీ॥ మాదు తండ్రియు ధృతరాష్ట్రమహావిభుండు
తల్లి గాంధారి మా సహోదర హితంబు
బంధుమిత్రులు నెవరి బృందమెల్ల
జయముగా నున్నవారె సంజయ తెలుపుము॥

సంజ॥ ధర్మతనయా! సౌఖ్యముగానే యున్నవారుగాని,

గీ॥ మట్టిగుడ్డను రతనమ్ము కట్టినట్లు
విధివశమ్మున వీరిట్లు వెతలబడిరి
రల సుయోధన కతమున సహజశమ్ము
పాలివహించెను నది కోప పంపెనన్ను॥

పాండవాగ్రజా! బోను వెడలిన సింగపు కొదమల భంగి సంగరంబున శత్రుల జయంబొసింపవలదు. సంగ్రామ రంగంబున జయాపజయంబులు దైవాధీనంబులు.

మాకు బుద్ధులు సెప్ప నీ కాలమందున.
చిత్తగించిరి; సంతసించినాము,
పరులను తమవలె భావింపకార్యంబు
చే కూరదు గాని విచ్ఛిన్నమగునె,
మాయ జూదమునందున్ని మమ్ములగోల్పుచ్చి,
కానకంపిన వారి ఘన చరిత్ర,
గీ॥ కొత్తయేమాకు వారికిఁ గొత్తమేము,
యిదియు నింగాక విదురుండు నెన్నిసార్లు,
సభ్యులందఱు వినుచుండఁ జదివెగాదె,
చెప్పలుఁ దూల్వడ ధర్మంబుచెల్లె నాకు.
ద్రౌ॥ ఏమేమి! అన్నయ్యా,
సీ॥ మనతండ్రి ధృతరాష్ట్ర మహిపతియెట్లగు
పాండుభూపతిఁగాక భవ్యచరిత,
మనతండ్రిధృతరాష్ట్ర జననాధుఁడైనచో,
వనములవసియింపవలెనె మనము.
జనులందఱయ్యయ్యయో, యనుచుండ సభలోన
జేయు సేతల నుపేక్షించెనతఁడు,
అవియన్ని మఱచి తీనన్నస్వల్పములోనె,
మన యభ్యుదయము తా మనసునందు,
గీ॥ నరసియుండెనె? యజ్ఞాత ♦ సరణివినడె?
పరులు దూషింతురనుచు ద ♦ గ్గరకుదీసి,
పెంచినాడన్న పేరొందుఁ ♦ గాంచెగాని,
మొదటికే మోసమును దెచ్చు ♦ యచ్చుభంగి.

బాబా శ్రీకృష్ణా, ధనుర్విజయంబీ విజయునిదో యా కర్ణునిదో; భీమగదాయోధనం బాదుర్యోధనునిదో యీ భీమునిదో; ఆర్యులందరుఁ జూడగల కాలంబు కొద్దిలో చేకూరఁగల్గె; నింతలో యీ ఁమన్న కింత తొందరయేలః?

కృష్ణ॥ అర్జునా తొందరగాదది. ఆక్షేపణలేనిదే. యోల్లనిన

గీ॥ విధివశమ్మున మృగరాట్టు నొదిగి యొదిగి
బిలమునందునఁ గొన్నాళ్లు వెడలకుండి
మత్తమాతంగ సందోహ మూగఁ గాంచి
పైకి, గనువిప్పి యుఱికిన భాతిపార్థ॥
యీ భీమసేనుండు సమయమువచ్చె గదాయని తొందఱఁ బడుచున్నవాఁడు. క్షాత్రవంతుల కట్లుండవలసిన నిధియేకదా.

నకు॥ సహదేవా! యేమి! చిత్రము.

చ॥ త్రిదశవరిష్ఠుడా మనయుధిష్ఠిరు మోమున చండతేజముల్
వదలకనుండ; భీముభుజపై గదయున్నది; మంటమండుచుల్
చెదరిక పార్థుగేలున వసించెడి గాండివమెంత యేనియుల్;
గదసము గోరుచున్న యవి;కాలమె హేతువు వీనికంతటన్॥

సహ॥ పాపూర్ణముకుంద బాంధవకళా! నకులా! యీసంజయుఁడు సంధికార్యార్థియైవచ్చి మాతండ్రిగారు పంపినాడని బలుకుచున్నవాడు. మనకుతండ్రి యెవరు.

చ॥ అదియునఁగాక వారు మనమందఱమేక కులంబు వారమే

గద; యలనాడు రచ్చ గురుకౌరవసభ్యులు జూచుచుం
[డ [గ

పదికురులంటి యీడ్చుకొని వచ్చినయప్పుడు లెం[డి
[యున్న చో

నది తగదంచు బల్కెడి? సహాయుడు గాడు మనం
[చెప్పుడుగా॥

కాక యది యటులుండనిమ్ము. కౌరవసంధి కార్యార్థ
మై యేతెంచినావుగాని, యాదుర్యోధనుం డసమాన బలశౌర్య ధురీణులగు భీష్మ ద్రోణ కర్ణాదుల తోడను మహారథికులగు తొంబది తొమ్మిది తమ్ముల తోడను దుల దూగుచుండ నెందును గొనగాని, యీ పాండవ పంచకమునకు వెరచి సంధికొప్పి నిన్ను బం పెనా యేమి? సంజయా! యెక్కడిమాట,

ధర్మ॥ సంజయా! ఆదుర్యోధనుండు కర్ణశకుని దుశ్శాసను లెట్లుచెప్ప నట్లు నడచుగాని ధర్మమార్గంబు విచా రింపడు. మమ్ముల సంతసపెట్టుటకై నీవిట్లు వచించితివి గాని, యా దుర్యోధనుడు సక్కని నయంబు లెక్కసేయుం గని వాడెవరు? రాధేయుండర్జును గెల్చు గదాయని పిట్టపీగుచుండు. కానిమ్ము నీవు కౌరవపక్షపాతివై పలుకుచున్నట్లు దెలియుచున్నయది.

ఉ॥ ముందుగ మమ్ములన్ బొగడి పూర్ణులు భీష్ముడు ద్రోణ
[కర్ణులం

చంపునదేమి? నాదుమది యందుకు సందియమొందుచుం
[డె నీ,
గంధవహాత్మజుండును నలగాండీవధారియు మాద్రిపుత్రు
[లున్,
స్యందనరాజినెక్కి వెస సంగర భూమినిఁగాను పించినన్.

ఆకౌరవులేగాక శంకరుడైన నెదుర్కొన సమర్థుఁడగునే. యుద్ధంబున వారలఁ జయించలేమను, నుతులు మాత్రమటంచుము. మేమట్టి కీడు చేయఁదొడంగువారము కాము. కులంబుద్ధరింపఁ దలంచెదేని కొడుకులకు బుద్ధిఁ జెప్పి, యిందప్రస్థంబైనను, మఱియేది నైనను, యిచ్చుట సంధికి మూలకారణమనియు. ధర్మమెటులుండ జయమటులుండు ననియుఁ దెల్పుము.

సంజ॥

శా॥ దేవానేను వచించునట్టి నుడియందే దోషమున్నేని నీ
భావంబందున శాంతిబూని విను నావాక్యంబుఁ బాలించి ధీ
ప్రావీణ్యుండవు మూడులోకములలో రమ్యంబు పుణ్యే
[డితం,
బై వర్ధిల్లుచునుండు నీనడత కా నల్పంబుఁ గాదెందులన్

అయ్యా యొకవేళ కౌరవులు చెడిపోదలంచి పాలీకున్నను. నీవు మాత్రము యుద్ధంబుఁజేసి యా రక్తాన్నము భుజించుటకంటె, భిక్షాన్నంబె మేలని నా తలంపు. ఎట్లనిన,

వినము కౌరవరాజు పాండుసుతులఁ బ్రేమించి పాలీ
[యకే
మృదువాక్యంబులఁ బొగ్డుచుచ్చినను హాయిఁ గల్గునే
[వీరికిఁ
ఁ దనపాయంబుగఁ బాలొసంగఁబడకే సంతోషముఁ గల్గునే

కావున, సంజయా! మున్నట్లవమానపడి, యూరకుం డుటకంటె. యుద్ధంబుజేయుట న్యాయంబుకాదా యేమి? సంగరంబుజేయుట క్షత్రియులకు ధర్మంబని శాస్త్రంబులు ఘోషించుచున్నవే? కాక యీపాండు నందనులందేమైన దోషంబున్నదా? మదోన్మత్తులై మున్నమిన్నగానక గౌరవులే వీరికి గీడు జేయ దలచిరోనిరి. అదినీ వెరుంగవా యేమి? సంజయా!

మ॥ కనవా నాటిదినంబునందు సభలోఁ గర్ణాది దుశ్శాసనుల్
దీన పాంచాలిని కొల్వుకీడ్చుటయు దుర్మార్గంబుగా
[నాడుటల్
వినవా యప్పుడు చెప్పనేరని వృథావృక్షంబులై మీరలిం
దునకా వచ్చితిరెట్లునేర్చితిరి సద్బుద్ధుల్ బలేయిత్తురే?

సంజయా! ఆకౌరవులా, యీపాండవుల క్షేమం బడు యుట. మున్నట్లవమానపడి శాంతమూర్తులై యీ పాండవు లూరకుండిరిగాని మహోగ్రులైనచో నూరకుందురా! ఆసమయంబున కర్ణుడు నిండు సభలో ద్రౌపదిని గాంచి "నీనాధులు నిన్ను విడచిరి కాన మాలో నీయిష్టమునవాని నొకని వరింపు"మని యన్న

మాట మఱచితివే? ఈ పార్థుని హృదయంబెట్లు
న్నదో తెలియునా! పాండవులు పౌరుషహీనులని
దుశ్శాసనుండు పలికె. కావున నీ పాండవులు సంధికొ
ప్పెదరను మాట సందియముగా నున్నయది. అయి
నను నే నా సంధి విషయమై యీ పాండవులతో
కొంత ముచ్చటించి రేపటిదినం బా ధృతరాష్ట్రుకడ
కేగెద.

సంజ॥ యుధిష్ఠిర మహారాజా!

చ॥ హృదయము సంతసంబుగ నె, గృష్ణుడు పూజ్యుడు రాయ
[బారియై
గదలెదనంచు బల్కె నిక కార్యము చేకూరె కృష్ణుడేగినన్
కదనము మాన్పజేయు నోడికంబుగ గూర్చును సంధి! నింక నే
గెద తమరాజ్ఞ యిచ్చినను గేరుచుబంచిన పాండునందనా!

ధర్మ॥ సంజయా! కురుపక్షంబున నున్న యోధులెంతటి
వారైనను మమ్ము జయించుట మాత్రమబద్ధము. ఇది
యటుండగాక మాకు ధర్మదేవతతోడై యుండును?
వెండియు

ఉ॥ పెట్టని కోటయై యెపుడు పెద్దలు పిన్నలుం దోడునీడయై
చుట్టము నిష్టదేవతగ చూచుచు గాచెడి ప్రాణమిత్రుడై
గట్టును మట్టునన్ బలుకు గోరిన సద్గురుమూర్తియైన యా
దిట్టపు నందనందనుడు దిక్కయి యుండగ దిక్కు వేమగున్.

కావున సంజయా! కలహావాంఛ యెపుడును నామనం
బున లేదు. వారి భాగంబు వారు గైకొని మా పాలు

మాకొసంగి మేము భయములము గలసి సుఖంబుగా నుం డుట మాకోరిక. ఒకవేళ మాకు సగపాలిచ్చుటకు సమ్మతింపక పోయినను కుశస్థలము, వృకస్థలము, మాకం దియము, వారణావతము యింద్రప్రస్థములను యీా యైదూళ్ళిచ్చిన జాలునని జెప్పినామని మాతండ్రిగా రితో జెల్పుము.

సంజ॥ ధర్మతనయా! అలాగుననే దెల్పెద ఇంక నాకు సెలవిమ్ము! పోయివచ్చెద.

ధర్మ॥ సంజయా! మంచిది! పోయిరమ్ము ధృతరాష్ట్రిదులందరి నడిగితిననుము.

(అందరు నిష్క్రమింతురు)



# తృతీయాంకము

(కౌరవుల ద్వితీయరంగము.)

(ధృతరాష్ట్ర, భీష్మ, ద్రోణ, విదురుల ప్రవేశము.)

ధృత॥ సభ్యులారా! మనసంజయుండు పాండవుల కడకేగి యింకను రానికారణమేమో తెలియకున్నయది.

విదు॥ ధృతరాష్ట్ర మహారాజా!

మ॥ ధరణీ నాయక! సన్న సంజయుడు ఆ స్త్రాందంబున ప్రస్తా [ప్రీకెఁ

నరుగన్ పిమ్మటఁ గన్నుచీకటులు గాయన్ వెంట లేకెవ్వరోం
టరిగా మన్నపుఁ జేరనాయు నొకమాటన్ వింటి సత్యంబుగా
చ్చెరదో వచ్చుచునున్న వాడిచటికే సన్మార్గ సంశీలతన్॥

సంజ॥ (ప్రవేశింప)

ధృత॥ సంజయా! పాండురాజు సుతులేవ్వరు సుఖముగ నున్నవారా?

సంజ॥ రాజా సుఖముగానే యున్నవారు.

ధృత॥ నీవు వెళ్లిన కార్యము నెరవేరెనా?

సంజ॥ నెరవేర కేమి?

ధృత॥ ఏమనిరి.

సంజ॥ అందరు నన్ని తెఱంగుల నుడివిరి.

ధృత॥ ఎవరెట్లు నుడివినను సంధికేమైనా చోటుండెనా.

సంజ॥ ఉండకేమి.

ధృత॥ సమీరనందనుం డేమనెను?

సంజ॥ ఈ భీమసేన మత్తద్విరదంబు తత్సోదర నిగళంబుచే కట్టువడియుండెగాని లేకున్నచో వృష్ణి గుంపుల పయిం బడు ప్రకంబుకై వడి దుష్టకౌరవులఁ గాండీకులఁ జేయక మానుదునే యని యనెను.

ధృ॥ అటులనెయగా! తరువాత పాండవమధ్యముండేమనెను.

సం॥ ఈ ఫల్గుణ మృగేంద్రంబు సమయ శృంఖలంబున కట్టువడి యుండెగాని యికమీఁదట్లుండునా యని అనెను.

ధృత॥ కవల లేమనిరి?

సంజ॥ ధర్మతనయుని ముఖతేజస్సును భీముని గదోద్రేకమును ఫల్గుణుని గాండివపటిమయును, జూడఁ యుద్ధము గోరుచున్నవని యొకరితోనొకరుఁ జెప్పుకొనిరి.

ధృత॥ తరువాత ధర్మజుడేమనెను?

సంజ॥ వారిసగపాలు వారుగైకొని మాసగపాలు మాకిచ్చి ఉభయులము గలసియుండుట మంచిదని జెప్పె. అట్లు సమ్మతింపరేని మాయైదుగురకు నైదూళ్ళిచ్చినను జాలునని జెప్పె. ఇదియే సంధికి మూలమనియె. తరువాత శ్రీకృష్ణుండే జెప్పుననియె.

ధృత॥ ఆభగవాను లేమనిరి.

సంజ॥ పాండవకార్యార్థియై తానుముచ్చటించ రేపటి దినంబు తమపాలికి వచ్చెదనని నుడివె.

ధృత॥ ధన్యుండ ధన్యుండ రత్నాగభీర! విదుర! ఎంత మోసము వాటిల్లె.

విదు॥ రాజ్యమంతయు దక్కనుకదా యని పాండవుల పాలి యెక కొడుకులుచేయు దుష్కార్యములకుఁ దల యూచు చుంటివి. నీకేమి మోసము.

సీ॥ ఇనసుతు ప్రోద్బలంబునఁగదా నీసుతుల్
కయ్యంబునకు పైకి గాలుదివ్వుట
నీయందు ధర్మవినీతి లేమినిఁగదా
రాజధర్మముదప్పి వర్తిల్లుట
అదియేమి యని నోటనాడకుంకుట గదా
కొలువులో ద్రౌపది కొప్పలుముట
పాండవుల్నియానఁ బడిచరించుటఁ గదా
వనవాస మొనరింప వలసియుంట

గీ॥ గానఁ బెద్దలు నుడివె వాక్యంబు నొకటి
కుల విదూషకులైనట్టి కొడుకుల విడుఁ
చుటయె ధర్మంబనిన నీవి చూరవిడిచి
యూరకుండుట యదినీకు మేరకాదు॥

ధర్మగుణ సంపన్నుండైన ధర్మనందనుండు నియంచి తతి భక్తిచే భవత్కుమారులొనరించు చెడుకార్యములకు నొప్పి శాంతంబు వహించి యిప్పటికిని నూరకున్నాడు. భీమార్జున మత్తగజేంద్రంబు లాధర్మజు శాంతివాక్య పాశబద్ధులై యూర కున్నారుగాని, కాకున్న నో యీపాటి కెట్లుండునోయట్లుండు.

నీవు వారల తండ్రిపోయిన నాటినుండి యతిప్రేమతోఁ బెంచి యిప్పుడిట్లుపేక్షించుట నీకు ధర్మంబుఁగాదు. రాజా!

శా॥ నేనీపల్కులు జూదమాడకయు మున్నే నీకుఁబల్ చెప్పితిన్
గానీ రోగికిఁ బథ్యవస్తు రుచియుంనుఁగాదన్న యారీతినిన్
నే నీతో వచియించునట్టి పలుకుల్ నీచంబుగాఁ దోచెగా
భూనాథోత్తమ! ఇంకనైన మదిలో పూరించినావాక్యముల్ ॥

వంశదూషకులగు కొడుకులను విడుచుట ధర్మంబని పెద్దలు నొక్కి వక్కాణించిరి. కావున యిప్పుడైనను అధర్మవర్తనులగు నీకొడుకుల మాటలుఁ జెవినిబెట్టక పాండవుల నాదరింపుము. అట్లాదరించవేని, నీకొడుకులు బడుపాట్లు, నీవే చూచెదవు.

ధృత॥ ధర్మవిరుద్ధులైనను కొడుకుల విడుచుటఁ బాడికాదు. ఎవ్విధినైనను పాండవులతో సంధిజేయఁ బ్రయత్నించెద.

విదు॥ కౌరవేంద్రా! నీవెట్లయినను, నీకొడుకుల సమాధానపరచి పాండవేయులకు కొన్ని పల్లెలనిచ్చినను మేలు బొందెదవు. లేకున్న కీడుజెందెదవు.

ధృత॥ సంజయా! పొరబాటున మరచితి శ్రీకృష్ణుండు మఱి యేమేమి చెప్పె.

సంజ॥ రాజా! నిన్నటి దినంబునఁ శ్రీకృష్ణుని వాక్యములు తమతో జెప్పుటకు ప్రయత్నించితిగాని తమకేమి కోపము వచ్చునోయని సందేహించితి. సెలవిచ్చినచో నిప్పుడైనను జెప్పెద.

ధృత॥ సంజయా! అదియేమి చెప్పుము.

సంజ॥ సీ॥ కలిగున్న ధనధాన్యముల నెల్ల భూసుర
వరులకు విసరివోగ పరచుమనుము
అలుబిడ్డలపైని యధిక మోహాబ్ధిని
మునిగి మునిగి చేలు మనిరెమనుము
హీతజనాప్తశ్రేణి నెల్లర దనియింప
సత్కారముల చెక్కు నలుపుమనుము
తొల్లిటికంటె సతులసౌఖ్యముల నిష్ట
తులదూగి తులదూగి కులుకు మనుము
గీ॥ ఎప్పటికి దేనియందున యిష్టమగు
నన్నిటిని తన్ను భుజియింపు మనిరెమనుము
పాంచపంచక మరచేత బట్టుకొనుచు
భండనమ్మున కటు దేర భాశ్యమనుము॥

కం॥ అలనాడా పాంచాలికి
కొలువున పరిభవము మీరు గూర్చినయపుడా
లలనామణి నను పిలిచియు
విలపించినదంత మదిని బెట్టితినమిూ
అని శ్రీకృష్ణభగవానుడు వచించినాడు.

దృత॥ అప్పుడు పార్థుడేమనెను?

సంజ॥ పార్థుడు మాయర్ధరాజ్యంబు మాకీమని మేమడుగ వారీకుండెనేని మాకు సంతోషమేయనియె. ఇదివరకు కొడుకులు చేయు దుష్కార్యములకు నిది పన్నెపెట్టిన హిరణ్యంబు పగిది ననియె. సమరతలంబున నాపి

ర్యోధనుం డీల్గినప్పుడుఁగాని యా వనవాసంబున నీయు మతనయుండు బడిన వెతఁదీఱదనియె. శుష్కారణ్యంబు పైబడు వైశ్వానరుని చందంబున యీధర్మజుండు కౌరవసేన మీఁదఁబడునప్పుడుఁగాని మమ్ము సరకుగొనరనియె. యీ భీమసేనుండు గదాదండంబుఁ బూని ప్రళయ కాలరుద్రునివలె రిపు సైన్యంబుపై బడునప్పుడుఁగాని యా దుర్యోధనుండు మాయర్ధరాజ్యంబు మాకీయఁడనియె. యాకటితోనున్న శార్దూలంబు కురంగంబులఁపయిబడు చందంబున నకుల సహదేవాభిమన్యు సాత్యకి ప్రముఖులు రణంబున వేటాడునప్పుడుఁగాని మాస్నేహంబుఁ బాటింపరనియె. ద్రుపద విరాటులు శరసంధాన తూణీరులై యుద్ధంబునఁ దూలించునప్పుడుఁగాని మాయలుక దీరదనియె. రణవిద్యానిపుణుండగు ధృష్టద్యుమ్నుండు ద్రోణునిఁ దాకినప్పుడు గాని మాకు వెఱువరనియె. జగద్రక్షకుండగు శ్రీకృష్ణుండు సారథియై, యేను రథికుండనై సారథ ధ్వజంబున హనుమంతుఁడు ప్రకాశింప దేవదత్తంబు మ్రోయించి, గాండీవంబు సారించి యేను పరిపంథి సైన్యంబు మధ్య విహరించునప్పుడు,గాని మాయందు దయఁ జూపరనియె. ఈ శ్రీకృష్ణు నాదుర్యోధనుండు లెక్కగొననప్పుడు మమ్మిపు డెటులఁ లక్ష్యపెట్టుననియె. తరువాత భీష్మద్రోణాదులకు నమస్కరించి మారాజ్య భాగంబునకుఁ యుద్ధం బాచరింతుమనియె. శ్రీకృష్ణుం

డు మాకుఁ దోడై యుండుటంజేసి జయముఁ దప్పక వాటిల్లుననియె.

భీష్ము॥ కౌరవేంద్రా! ఆయర్జును క్షేమునఁ గొంటివి. మున్ను హిరణ్యగర్భుండు నిండుకొలువై యున్న సమయంబున

ఉ॥ అచ్చట దివ్యతేజులు మహాద్భుతరూపులు నుత్తమోత్త
[ముల్
హెచ్చుపరాక్రమక్రములు నిద్దరుపూరుషు లుండగాంచి సు
రెచ్చటి వారలంచు మదినెంచుచు నింద్రగురుండు బ్ర
[హ్మతో
ముచ్చట జేయగా నపుడు మోదముతో రచియించె నిట్ల
[గా॥

గీ॥ తపము, తెంపును బలశౌర్య దర్పములును
గలిగి లోకహితార్థంబు గాఁ జరించు
చుండ్రు వీరి నామంబులు సురుచిరముగ
బల్కెదరు నర నారాయణు లటంచు నన॥

లోకంబున నెప్పుడధర్మము కాలుపెట్టునో యప్పుడు వీర లవతరించెదరు. ఇప్పుడా నరనారాయణులు కృష్ణార్జునులుగా జనించి అర్జునుండు నివాత కవచుల నధియించినదంతయుఁ దెల్లంబేకదా! శ్రీకృష్ణుండు కంస నరకాసురుల హరించినదంతయు నెఱుకయేగదా! ఇపుడు వారిరువురు నేకీభవించి యొనర్చు సంగరంబున వారల నెదుర్కొన మనకేకాదు యా మృత్యుంజయునకైన దరంబగునా అయినను నామాటలు నీవిప్పుడు పాటింపవు. శ్రీకృష్ణుడు సారథియై అర్జునుండు రథి

కృష్ణ యుద్ధంబున జారవడినప్పుడు గాని వారుఁ బడిరి. వీరుఁ దలఁచి చింతింపవు. దుష్టకార్యాచరణ పారాయణులగు కర్ణ శకుని దుశ్శాసనుల వాక్యంబుల దప్ప మఱెవ్వరినిఁ జెవి నిఁబెట్టవు. అందున కెవరేమి జేయగలరు.

ధృత॥ తండ్రీ భాగీరథీ నందన! నాపక్షంబున నిట్లాడదగునా!
నీకు నేనేమి దుష్కార్య మొనర్చితి. ఇట్టి పల్కులు
నీవాక్యంబున నెట్లు వెడలె.

భీష్మ॥ ధృతరాష్ట్ర మహారాజా! నిజమాడువారికి నిష్ఠురవా
క్యంబు వెంటనే వచ్చునన్నట్లు నిజంబెఱుగక మాటలా
డదవు. నేను వారికి పక్షపాతినా? ఇటుల వినుము

శా॥ కానన్ హైన్యము సిగ్గులేక యిప్పుడీ కర్ణుండు కౌంతేయులన్
నేసంహారముఁ జేతునంచు బలుకన్ నీపుత్రులున్ నమ్మగా
నే సంతోషము? ఘోషయాత్రికథ విన్నే లేదె? గంధర్వులం
దీనావస్థను యుద్ధ కౌశలముఁ దానేమాయెనో జూడ
[గన్

కర్ణుని విక్రమాదుల మాటలచేతనే నమ్మియూపాం డవుల క్రోనరించితివి. కావున నీకర్ణుని పరాక్రమం బెవ తెరుగకుంటిరి. పాండవులు యుద్ధమం దాఁ తేరినవారు. ఆకర్ణుండు తన నోటికివచ్చినట్లు ప్రగల్భములు గొట్టుచున్నాడు. అది యెల్ల నీవు కర్ణామృతముగా వినుచున్నావు. కాని నిజమేదో యెఱుఁగకుంటివి.

ద్రోణు॥ కౌరవేంద్రా! ఈగంగాసుతుని వాక్యంబులు పరమ
హితంబులు. నీకు ధర్మనందనునితోటి వైరంబుఁ ద

దు. యుద్ధంబున జయంబు సందేహంబు. మన బలం బునందే గాక పార్థు నెదుర్కొను వీరుండు త్రిలోకం బులను లేడని నిశ్చయముగా నొక్కి వక్కాణింతు.

ధృత॥ సంజయా! మనమతిబల సైన్య సమేతంబుగానుం డుట యాయుజ త శతుృంచు నెఱింగియుండెనా? ధర్మనందనుం డెవరిని గైకొని మనమీదికి దండెత్తి వచ్చెను.

సంజ॥ కురువంశాగ్రణీ,

ఉ॥ ఎంతటి వెఱ్ఱివాడవు మరేమి వచించెద వీ వెఱుంగవా?
కుంతికుమార వర్గములకుం గలప్రోడతనంబు శౌర్యమీ
చెంత వహించు యోధుల విచిత్రపు యుద్ధము శాంబర్ [గతుల్
యింతని చెప్పగాగలనె యీశ్వరుడైనను చెప్పజాలునే॥

బకాసురాంతకుడును హిడింబాసుర సంహారుండును సికహబల దర్పాపహారుండును, మహాబలుండును, నగు భీముండును, రణంబున పశుపతిని మెప్పించినవాడును ఖాండవార ణ్యంబు దహించినవాడును నగు అర్జునుండును సంగరంబున సింగంబులోయన రిపువీర మృగపంక్తుల పయింబడి చెండాడు సకుల సహదేవులున్ను అసమాన శూరులగు ద్రౌపదేయు లును భుజబలంబున సవ్యసాచికి సాటియన నొప్పు సౌభద్రుం డును పరిపంథి నిర్మూలనంబు గావించు సాత్యకియును మహా కార్య ధుర్యుండగు ద్రుపదుండును అపరిమిత బలుండగు విరాటుండును అతని సోదరులును పుత్రుండగు నుత్తరుండును

కేకయపతులును జరాసంధుని కుమారుండగు సహదేవుండును నసమాన భుజబల విక్రములగు శిశుపాల సుతులును యదునాథుండగు చేకితానుండును, నా యజాత శత్రునకు ముందు నడతురు. ఇదియునుగాక భీముని పుత్రుండు ఘటోత్కచుండనువాడు తండ్రికంటె మహాబలుండని మాయోపాయుండని పేర్కొనియుండె. ఇతడు మన సైన్యంబును జీకాకు జేయంగలండు. అదియంతయు నట్లుండ శ్రీకృష్ణుండు వారి పక్షంబున నుండ యిక వారికేమి కొదువ.

ధృత॥ సంజయా! నీవు వచించిన యోధులందరును ప్రబలులె! అందులకేమి సందియంబు లేదు. అయినను,

ఉ॥ అందరు నొక్కయెత్తు పవనాత్మజుడొక్క డొకెత్తు వి
|మ్మునా
డెందమునందు నెంచిన గడిందిగ గుండెలు ఝల్లుమంచు కే
యందున నిద్ర రాదు మఱి యాతని మార్కొనజాలు వీ
|రుడ
బృందమునందు లేదు రిపుభీకరమూర్తి యటంచెఱుంగవే

యమదండ తుల్యంబగు గదాదండంబు పూని కురుసేన మధ్య విహరింప నెదుర్కొన యోధులెవరు? అసురాసురులకే గెలువ దుర్లభంబై యొప్పు భుజాయుద్ధంబున నా జరాసంధుని నొక్క త్రుటిలో బరిమార్చెగదా. ఇప్పుడు పూర్ణంబగు కాతరంబు బూని, నాతో పోరువారెవరో రమ్మని యీ కురు సేనలో జొరబడి గదావిహారంబు సలువ వెన్నచ్చి

పాటిపోక నిల్చువారెవరు. కాన నా వాయుపుత్రు శౌర్యదధి నీడ నా కుమారుల కలవియగునా?

గీ॥ చిచ్చునకుఁ దోడుగా గాడ్పు వచ్చినట్లు
వాతపుత్రుండు విజయ సమేతముగను
వచ్చి కురుసేన జొరగ నెవ్వారలెదురు?
ఇంమగన మిక త్రిభువనమందు గనము॥

గాన మున్ను భీమసేనుండెంత చెప్పినంతయుఁ జేయును, ఫల్గునునికి శ్రీకృష్ణుండుఁ దోడై యున్నవాఁడు. [illegible]గాం[illegible] [illegible]యాగంబునఁ బొడమి భీమసేన గదావిహారంబున రేగి[illegible] కాలాగ్ని యీ కౌరవాటవిం దహింపక మానదు. [illegible] పరాక్రమంబులే భీష్మ ద్రోణులకంటె [illegible]వరెఱుఁగుదురు. యీ భీష్మ ద్రోణులు మన పక్షంబున సం[illegible] నొకవేళ యుద్ధంబున కాయత్తంబైతిమేని [illegible] ముగింపఁ[illegible] నుందురు. కాని పాండవులు,

గీ॥ జాహ్నవీ పుత్రునకు వంశజాతులగుట
జెలఁగి ద్రోణున కత్యంత శిష్యులగుట
జేసి వీరికి మనయందుఁ జిత్తమట్లు
సంచరించునె వారిపై మించునటులె॥

మొదటనుంచియు [illegible]రుండెట్లుగా నచింపెనట్లే యగుచున్నయది. ఇంక నేనేమిఁ జేయుదు? మనము

కం॥ నిందా దయాపరులగు నా
పాండవులను గెలువబూని[illegible] గన[illegible]
మండెడు నగ్నిని గాంచియు

మెండుగ మఱి మిగ్రింగబోవు మిడుతల బోలెన్‌॥
పాండవులతో జగడంబుఁ కులక్షయంబునకుఁ గారణంబు. కాన నా కుమారుల నెట్లయినను సంధిజేయ బ్రేరేచెద. సంజయా! ఇంక నీవరుగుము. (అంత సంజయుడు నిష్క్రమించు)

(తెర పడును.)

(ధృతరాష్ట్ర భీష్మ ద్రోణ దుర్యోధన కర్ణుల ప్రవేశము.)

ధృత॥ (అత్యార్తి) నాయనా! దుర్యోధన! నావాక్యము మది నుంచి పాండవుల రావించి వారి సగభాగము వారికి బంచిఁ లోకాపవాద మోదమ్రించి, వంశవృద్ధిని గావించి, సజస్ర్రము వర్ధిల్లుము.

దుర్యో॥ (తలయూచి) తండ్రీ! అలాగునా

చ॥ అటవులయందు శైలములయందును వాసము జేసి చేసియిప్పటికి బుద్ధిబుల్గాఁ గనగ పాండుకుమారులు నేడువచ్చిరేమొ కుటులన్ మమ్ములం గెలువ నించుక మాత్రము రారు
[వచ్చినన్,
పటుతరశక్తిలేమి మఱిఖండనముల్ సలుపంగ వారికిన్

ధృత॥ కుమారా! దుర్యోధనా! ఆపాండవులు,

చ॥ అటవులసంచరించినను నద్రిలపై నివసించి వచ్చినన్
కుటిలములేని వారికొనఁగూడను కూడమిఁగొన్ని నాళ్లకున్
యుటులదియుండ నిమ్మికిప్ర డాహరిఁ దోడుగనుంటెఁవారు గెల్చుటలు నసాధ్యమే మనల; కూరను భీముడొకండుఁ
[జాలడే॥

తండ్రీ! దుర్యోధనా! వారిప్పుడు కూటికి పేదలై తూలి కానయుంబులు గలవారైయున్నప్పటికిని వారికిధర్మంబే జయమునిచ్చు. కాన వారిరాజ్యభాగంబు వారికిచ్చి యాదరింపుము. ఆపాండవు లసమాన శూరులు.

దుర్యో॥ జనకా! కౌరవనాయకా! ఆపాండవులసమాన శూరులా! తక్కినవారు వ్యర్థులా! ఆపాండవులు మమ్ము గెలిచెదరను మాట కలలోనిమాట. ఈభీష్ముండేమనుకొంటివి.

గీ॥ పరశురాముని గెల్చిన బల్లిముండు
సమరమున నీతడలిగినఁ జాలునెవడు
వంతుకెక్కంగ సత్తురా కుంతిసుతులు
వత్తురన్నను నగరె యీవసుధజనులు॥

ఇదియునుంగాక యయోనిజులగు కృపద్రోణు లాజిముఖంమున నిల్చి రేని త్రిపురాంతకుండైన నెదుర్కొనగలడా? ఈశ్వర వరప్రసాదోద్భవుండగు నశ్వత్థామ సామాన్యుడనుకొంటివా. సహజ కవచకుండలుండును, అసమాన భుజబలుండును, నగు కర్ణునితో రణంబుశేయు నేర్పుగల వారంచెవరు. బాహ్లీక సోమదత్త భూరిశ్రవ సైంధవాది మహాశూరుల పరాక్రమంబు లింతింతని వర్ణింప నేరికైనను దరిగాదె. యుద్ధంబున నాకు సహాయంబుజేయ సమస్తదేశ రాజన్యులు నాకై ప్రాణంబులీయ దలకొనియున్నారు. కాబట్టి తండ్రీ! ధృతరాష్ట్ర చక్రవర్తీ!

ఉ॥ ఇంకను పాండురాజసుతు లేవ్వరునైనను నొక్కఁడైమాన
వంకను జూడగాఁగలఁడె వ్రియ్యాలుఁ జేయమె యొక్క [నొక్కని
బంతు వహించెదీ వనిలజాతు దురాసదుఁ బెద్దజేసియా
సంకటమీాగు మింకత ను సంగరమందున నన్నెదుర్చునే॥

గదాయుద్ధంబున నెట్లును నాచేతం బడఁగలవాడు. అ
తండుఁ బడెనేని వారిలో యుద్ధంబుఁ జేయ నేర్పరితనఁబుగల
వాఁరుండెవండు. వివ్వచ్చుండుండె గదాయని యంటివేనియాతని
కష్టించు గురుదత్తంబైన శక్తిచే గూల్పం గలంచు. నాసామ
ర్థ్యాసామర్థ్య ములెరుంగక వచించు చుంటివి. యుద్ధంబు
న [illegible] రల జయించి నేనజయంబుగాంచు నప్పుడు నీవేజూచె
దవుగాక.

ధృత॥ వత్సా! నావచనంబులు పెడచెవినిఁబెట్టక వినుము.
పాండవులతో వైరంబుమాని మీారుభయులుఁ గలసి
మెలసియుండుటయుత్తమ కార్యంబని నాదలంపు?
ఆయుమతెనయుండు [illegible]ంతిసుధానిధి యగుటంజేసి మన
చేయు దుష్కార్యంబులు స్వాంతెంబున దలంపక పెద్ద
లు జెప్పునట్లుగా సంధికొప్పుకొనును గాబట్టి నీవు.

శా॥ రాజ్యంబందున నర్ధభాగమిడ వారల్ మెచ్చ నీవింకసా
మ్రాజ్యం బొందెదవన్న లోకములలో రాజుల్ నినుఁ [మెచ్చు; నం
పూజ్యుండయ్యెదవన్న; మానుమిక యీ పోరాట [మోయన్న! నీ

రాజ్యంబే మఱిఁజాలుఁ దిక్కనను రారాజంకుప్రే జన్యతిక

నాయనా! నీవు వారితోఁ బగఁగొనుట భీష్మద్రోణుల కెంత మాత్రము సమ్మతము లేదు. ఈకర్ణుండు నిన్ను బ్రోద్బలంబుఁ జేయుటయు దుర్నీతిపరులగు శకునిదుశ్శాసనులు యుద్ధమే మంచికార్యమని నిర్ణయించిఁ జెప్పుటయు నీకదిఁ జెక్కు సంతోషకరంబుగా నున్నయది. యుద్ధంబునం దసమానబలుం డగు భీమసేనుండు గదాదండంబుబూని శత్రుసేనను జావ మోదునప్పుడుగాని నాపల్కులు జ్ఞప్తికిరావు ధనంజయుండు ధనంజయుని వలనఁ గార్ముకంబు వదలిన వాఁడుగాఁడ వారలను ధర్మదేవతయు, వాయుదేవుండును శచీధవుండును నాశ్వినులు. ను, ననవరతము గాపాడుచుందురు. కావున నెన్ని విధంబులా లోచించినను సంధియే కర్తవ్యంబని దోఁచుచున్నయది.

దుర్యో॥ తండ్రీ! భీష్మద్రోణులు యుద్ధంబునకు సమ్మతింపక పోయినను పగరంబున కేతెంచు నాపాండవులతోఁ బోరి యా పాండవుల గూల్పఁగలుగుదురు. కర్ణశకుని దుశ్శాసనుల సహాయంబున పాండవక్రోధాగ్నిజ్వాలఁ దుత్రిటిలో నార్చెదను. అంతియేకాక వాడిగల సూదిమోపినంత స్థలమైనను నాపాండవులకీయ నామనంబు సమ్మతింపదు. నావిషయమై నీవేమి వెరువవలదు. నేను.

సీ॥ ఘనముగా నల్దిశల్ గ్రమ్ముక వచ్చెడి
కార్చిచ్చునైనను నార్చ ధలను
మంత్రతంత్రంబులు మఱిజల స్తంభాది
ఘనమైన విద్యలు గనుపఁగలను

గురుతరంబుగ నాజి నుక్తిచే నొనరింప
సంగతు లెఱిగి మెలంగఁగలను
సాటిలేరనగ రాజన్యులలో నేను
శరయుగ్మపాణినై తిరుగఁగలను

గీ॥ పగను సాధింపగా నే నలిగితేని
పాండవులగావ సురలకు వశమె చెపుమ.
యాత్మనుతి పౌరుషంబు గాదనెడిమాట
వినవె పెద్దలు బల్కుట వెత్తలండ్రి॥

కావున వారు పల్కిన పలుకులకు భయము చెందనేల? అందుకుఁ జెప్పెద వినుము. పాండునందనులును దృష్టద్యుమ్న సాత్యకీ ప్రముఖులును యస్త్రదగ్ధాగ్ని జ్వాలలయందా హుతిగా గలరు. ఈమాటతప్పక నిక్కంబని నమ్ముము. నీకింక మారుఁ జెప్పవద్దు.

కర్ణు॥ దేవా గాంధారీధవా.

గీ॥ గురుని శాపంబువలన నాశఁవిధాన
మును నశించెనటంచు నీమనమునందుఁ
దగిలెఁ గావలెనదియుఁ దథ్యంబుగానుఁ
మరల గాంచితి తచ్ఛక్తి హరునివలన॥

అస్త్రశస్త్ర నైపుణత్వ సంపదచే నెగడి యున్నవాఁడ నన్నుజయింప బృందారక బృందంబునకైన నదరంబుగాదు. ఇది యునుంగాక యీ భీష్మద్రోణులు సంతోషపడునట్లుగా అన్ని

తోఁకదండ నిర్గతశరధారా పరంపరల నాపాండవాగ్నిం జల్లా
ర్చెద నీవేటా చెదవు.

ఉ॥ పిచ్చగలాడవై యిటుల భీతినిజెందుమటఁ జేసి సంధియం
దిచ్ఛ వహించి తీవుబలహీనులు నుండిరె నీదుసేనలో
హెచ్చు బలాఢ్యులే నెవరినెంచిన నొక్కనికంటె నొక్కఁ
డొచ్చిన యుద్ధమందు కురుశూరుల గాంచినపాండవేయు
[లుం

ఒదిగి నొకమూలదాగియుండక బ్రతికివత్తురె బయటికి
వచ్చినను నొకవేళ సంగరంబున నిల్తురె నిల్చినను నొకవేళ
నాయకంబులు బట్టుదురె. బట్టినను నొకవేళ మాతో సంధి
పరిస్తులుగారు. యేను కర్ణుండని యెఱుంగరా కాబట్టి,

ఉ॥ వైరముమానరద్దు భువిపాండవులెంతటివారు జూడుమెం
కౌరవనాథ వారికులకాంతను నిండగు కొల్వులోపల
వారలు జూచుచుండ వలువల్ మరి విప్పగనప్డు మాకు పై
పైకులెల్లమైన మాపయిని భీకరమౌ కదనంబు సేతురే।

ఎందున కౌరగాని పాండవుల పెద్దగా జేసి భీతిఁ జెందెద
దవేల యందున భీముని పెద్దగా జేసి జేరొక్కనెదవేల అభీముఁ
డెంతటివాడొక్కసాయకంబునఁ బట్టి సంధింప నేర్పులేదే.
పసిగుబ్బిదుల భీమన్న యను పేరొకటి గద్దుగాని అందులకింత
పను పెరతురు. అయినను పాండవ పంచకంబులో పార్థుండొ
కండుమాత్రము సామర్థ్యంబుగలవాడే యగుగాని అతడు

ల్కులకా నీవలుగుట నీవులేని కయ్యంబునాకువియ్యం
బగునా! ఎక్కడిమాట చాలు చాలు.

భీష్ము॥ (నవ్వి) దుర్యోధనా! నీవును నీకర్ణుండునునా యుద్ధసా
మర్థ్యులు. ఈభీష్మద్రోణులు వ్యర్థులా. కానిమ్ము. ని
[illegible] ము విస్మయంబొందకుము. యుద్ధంబు
నొనరింప నీవుగృతనిశ్చయు డవై యుంటివికదా. ఏను
బునసీద్రోణ బాహ్లీకాదులు హాహాయనునట్లుగా దె
క్క వేలమందినిఁ గూల్చెద. పిమ్మట నీకర్ణుండెన్ని వేల
మందిని గూల్చునో నివేచూచెదవు. ఇప్పుడుఁ [illegible]
ల్పంబులుగొట్టఫలమేమి.

దుర్యో॥ పితామహా! ఇదివరకు నీవు.

ఉ॥ పాండవపక్షపాతివయి బల్కుచు బైపయిగూర్చి నీవు నే
ఖండనమందు నెన్నకను వైరిమహారథ యోధవర్గముల్
కొండెదనంచుఁ బల్కెదవుఁజిత్తమదెట్లుగ నొప్పు నీవు నా
పాండవులే బలాఢ్యులనిఁ బల్కుచునుండగ నెట్లు నమ్మదన్.

కావునఁగంగానందనా! నాపక్షంబున.

కం॥ కర్ణుండు దుస్ససేనుడు
పూర్ణుడు నాశకునివాదుముచ్చట లెవుడా
కర్ణింతురు మైదాదంబున
నిర్ణయుతన్ బక్కతోడు నీడల సరిగన్.

కాబట్టి నాకిక నోరు లేలకావలె. మీరెట్లు గావలె యు ద్ధంబున నాకు శంఖంబు దప్పక వాటిల్లు. యుద్ధంబు జేయుటే నాకు నిశ్చయంబు ధర్మమైనను సరే. అధర్మమైనను సరే.
ద్రో॥ (భీష్మునివంకజూచి) శాంతనవా!

సీ॥ వెట్టబుట్టిననాటికి బిరుదములెన్ని
జెప్పనోప్పనో గలిగున్న చేష్టలుడిగి
నాధ్వమైనంతివరకును వైద్యవితతి
నరసి తగినచికిత్సలు జరుపుకున్న.

కాబట్టి నీటికి వెఱ్ఱి యింతమాత్రమునకే మానదు. ఇక ముందు కృష్ణార్జునుల వలన మానను. కాని మనవలన

దుర్యో॥ (లేచియూచి) ఆచార్యా! మాకు వెఱ్ఱిబుట్టినదా. మా వెఱ్ఱి నీ యాకృష్ణార్జునులా! మీకు గడ్డములు మీ సములు నెరసినను దుడ్డంతమాటంటిరే మీకడ్డులేని పె త్తనము చ్చినందులకా!

ద్రో॥ లేని పెత్తనము నాకిచ్చుట ఖరియే. ఈభీష్మునికి గూడ నంతియేనా! ఈమహాత్ముండు బ్రహ్మచారియై పితృ వాక్యసమాలంబనమే లేకున్న నెట్లుండునో. [భీష్మునివం కజూచి] శాంతనవా! నిశ్చయముగా విచారింప రాజ్య మంతయు నీయదియేగాని యీతులువలది కాదుగదా.

కర్ణు॥ [నవ్వి] ఆచార్యా! ఈరాజ్యమంతయు యీభీష్మునిదా
అలనాడంబాలికాంబికాంబలను రాచకన్నియలముగ్గు
రదెచ్చియుందంబాలికాంబికలను విచిత్రవీర్యునకుఁబెం
డ్లిజేసియుంబనుభయభ్రష్టురాలన జేసిన నపుంసకునకు
రాజ్యము కలదా.

భీష్ము॥ ఔనౌను. నేనునపుంసకుండను. నీవు కులహీనుడవు.
ఎందుకు యింతపేలకుము. నానపుంసకత్వము నీపురు
షత్వము నాపురుషోత్తమ విజయుఁడుముందు కొన్నిదిన
ములలోగనబడబోవుచున్నయది. తొందరపడకుము

ద్రోణా॥ శాంతనవా! విశేషంబులేల? మనకు సాధ్యమైనంత
వరకు జెప్పితిమి. విధి యెట్లు బ్రేరేపించునో యట్లు
జరుగక మానదు. ఇంకబోవుదములెమ్ము.

ధృత॥ సభికులారా! అది సత్యమే.

[అందరు నిష్క్రమింతురు.]





# చతుర్థాంకము.

ధర్మభీమార్జుననకుల సహదేవుల ప్రవేశము.

(పాండవుల ద్వితీయరంగము.)

ధర్మ॥ తమ్ములారా! భీమార్జుననకుల సహదేవులారా! మన గోపాలదేవుని దుర్యోధనునకడకు రాయబారిగా బంపుదమా?

భీము॥ అన్నా! "పితృసమో జ్యేష్ఠః" యను నీతిప్రోక్తి నిన్నాటి వరకు తమ యాజ్ఞ మీరినవారము కాము ఏకష్టములు వచ్చినను యిప్పుడెట్లు మీరుదుము. కాని యొక్క విషయమాశ్చర్యముగా నున్నది. ఎన్నడే కార్యములయందును మమ్ముల నాలోచింపక నీవే చేయువాడవు. ఇప్పుడాలోచించుట నాకదికాశ్చర్యముగా నున్నయది.

అర్జు॥ అదియేమి? మన యన్నగారు మనల నాలోచింపక చేసియే కొంపకు తిప్పలుఁ దెచ్చె.

ధర్మ॥ తమ్ములారా! నేనేమి యొనర్చితి, దైవకృత్యంబునకు మనమేమి చేయగలము. మనమేకాదు.

నీపట్లఁ గృపఁబూని మాపయికినే యేకష్టముల్ వచ్చినన్
నీపై భారము బెట్టినార మిక నెంతేభక్తి దోరపారఁగాఁ
గాపాడంగను దిక్కు నీవె మకు కృష్ణా దేవకీనందనా!

దేవా! ఇపుడు నీవు చేయవలసిన కార్యంబొకటి కల
దు. ఆ కార్యంబు నెరవేర్చుట కిదియే తరుణము కాబట్టి నిదా
క్షిణ్యంబొకింత మాపై బెట్టితిరేని దుర్యోధనునితో వైరంబు
మాని సుఖంబుగా నుండెదము. నీవాం కురుసభ కేగవలయు
గాని, అయ్యెడ

సీ॥ మాతండ్రి ధృతరాష్ట్ర మనుజాధిపతియూహ
దుర్యోధనుఁడు బల్కు దుశ్చరిత్ర
సవినయంబుగ నిన్న సంజయు వార్తలు
వింటివిగద వాని విధమునెల్ల
దప్పక వారలు జెప్పిన చొప్పున
వనవాస మజ్ఞాతవాసములును
సల్పి వచ్చిన గాని సగభాగమును బంచి
పెట్టగాఁ దలపేమిఁ బుట్టదయ్యె
కొడుకులొనర్పు దుర్గుణములఁ దండ్రియుఁ
బాలించి యవి మాన్పఁజాలడయ్యె॥

గీ॥ ఘనతరంబుగ బంధువర్గంబుఁ బ్రియము
గలుగ కౌరవులను సుమతులుగఁ జేసి
యనువుగా నీవు వారు మేమందరమును

గలసియుండెడు మార్గంబుఁ దెలియదయ్యె॥

కృష్ణా! ఇదివరకు వారును, నీవును, సంజయుండును వినుచుండ మేము వైరంబుఁ గూడదని తలంచి మా యైదుగురకు నైదూళ్ళిచ్చినఁ జాలునని బలికితిమికదా. అమరోద్యోధ నంబెంతమాత్రమును జేయజాలదుగదా. మేమును వారు నేక భావంబున మెలంగుచుంటిమేని సమస్తలోకరాజన్యులు సంతసింతురుగదా. సిరికాసించి బంధుక్షేమని గూల్పబని యేమి? కుంత్రియాననమాట నాయనుమతంబుగాదు. "సంగ్రామరంగంబున జయాపజయంబులు దైవాధీనంబు" లన మాటయుండదికె వ్వేగదా! కాబట్టి పగమాని జయంబొందు తెరవొంగా లోచింపుము.

గీ॥ మాయయం దైనయుఁ బక్షపాతమును నేమాత్రంబు లేకుండగా
న్యాయంబొప్పఁ గనచే మెలంగి యిపుడన్యాయంబు సేవించకే
మాయాపుండవు వారికట్లుగను భీష్మద్రోణులుం బంచ్ఛగా
శ్రేయంబొందఁగ జేయుమయ్య కులముం శ్రీకృష్ణ! వేయేటికిన్॥

ఒకవేళ ధృతరాష్ట్రుని పల్కులు దుర్యోధనుండుఁ జెవిని బెట్టకేని,

గీ॥ సంధి పొసగదటంచు సంశయము బొంది
నంత నేతేరకుము సాధ్యమైనంతవరకు
సవినయముగ నొకటి రెండు సార్లు పూర్ణ
ముగ వచింపుము వేయేల ముదముదనర॥

తరువాత నీకెట్లు దోచిన నట్లుఁ జేయుము. మాకదియే పరమ హితంబు. ఓ శ్రీకృష్ణ! నీవు వారినెఱుంగని వాఁడవుఁ గావు. ఎప్పుడెప్పుడెట్లు వచింపవలయునో, యెఱుంగుదురు నీకు నేనుఁ జెప్పుటకుఁ బనిలేదు. చెప్ప నేనెంతవాఁడ, ఇఁకఁ బోయిరమ్ము.

(యించుక యాలోచించి)

జగద్బాంధవా! కృష్ణా!

కం॥ మును వెనుకను నారయకను
నినుఁ గురుపతికడకుఁ బంప నియమించితిగా,
నిను నచటికిఁ బంపగ
మనసొప్పక నున్నదకట! మఱిమాటే చూడఁగ॥

ఆ దుర్యోధనుండు కడు దుర్మార్గుండు. అతని మిత్రులంతకు పై వారు. ఇప్పుడు నీమాట వారంగీకరింపరని నాకు దోచుచున్నయది. నిన్ను కష్టంబులఁ బెట్టఁజేసి నేను బొందినది స్వర్గపదవి యైనను బనిలేదు. కావున నీవుఁ బోవలదు.

కృష్ణ॥ బావా! ధర్మతనయా!

ఉ॥ నన్ను గుఱించి నీవును ఘనంబగు భీతినిఁ బొందనేల నీ
వన్నది నిక్కమే యగు మహా కురునాయకు లట్టివారలై
యున్నను వారు బెట్టు వెతలొందఁ(?) మాకు నికెన్ని భం
[గులఁ

బన్నిదఁగాని మానుమికఁ భావమునందున భీతి నింకకుఁ॥
బావా! ధర్మతనయా! ఒకవేళ వారు నాకెగ్గుచేయ దలంచి
రేని అపుడు నిజముగా నేనలిగితినేని నన్ను నెదుర్కొన నెక్క
డ వీరులెవరు?

ధర్మ॥ బావా! శ్రీకృష్ణదేవా! నీవే మాకుదిక్కు. మమ్మెట్లు
పాలించెదవో యింక పోయిరమ్ము.

కృష్ణ॥ యమతనయా!

సీ॥ మొన్న నా సంజయు ముచ్చటలన్నియు
గనినీదుఁ బల్కులు విని నా డ
నీమనంబరయఁగా నిర్ణాయకమందు
దగిలియున్నది జూడ తథ్యముగను
కౌరవబృందంబు పోరు మానిచి మన
తో మెలంగదరంచు దోచదేమి!
వారి పక్షమున భగీరథిపుత్రుండు
ద్రోణ కర్ణాదులుఁ దోడుగలరు.
గీ॥ కన్నుగానక మితిలేని గర్వముగను
విఱ్ఱవీగుచునున్నారు వెఱ్ఱిబుట్టి

కం॥ నీధర్మమునీ విష్టయు
నీధార్మికత్వంబు మిగుల నీ శాంతంబుఁ
నీదోః పరిభావశీలత
నీదగు వినయంబుమిగుల నేవర్ణింతుఁ॥

ఇదిన్నిగాక, నాశక్తికొలంది సంధి విషయము ప్రయత్నించెద. నాపలుకులకు సుయోధనుండు సమ్మతించి సంధి కొప్పనేని,

గీ॥ సర్వజనసమ్మతంబయి నిర్వహించు
చెప్పినట్లుగ నాపల్కులొప్పదేని
సకలజన నిందనందు నిశ్చయముగాను
మనము మాత్రముసంధికి మఱియుననుచు.

ప్రయత్నించిన రమగుదురు జగంబున వ్వరుఁ దూషింపరు. ఒకవేళ సంధియొనఁగూడనేరదు. ఒనఁగూడకుండెనా. అక్కడవారి బలాబలంబు శోధించి నీకు జయంబుగలునట్టి మార్గంబు యోచించి వచ్చెద. అయినను ధర్మతనయా

కం॥ ఇప్పుడు నాకగుశకునము
నప్పాలిడసంధికుమరదని బోధింకఁ
దప్పక జరుగునటంచును
చెప్పెద మఱినన్నదకట! శీఘ్రతరముగన్.

నీవు మాత్రము సిరుత్సాహివిగ నుండకుము. సమ స్తసేనలాయత్తపఱచుకొని సేనానాయకులతో సమరసన్నాహం బాలోచింపుచుండుము.

ధర్మ॥ బావా! శ్రీకృష్ణా, కౌరవులతో యుద్ధంబుఁ జేయవలె నని మాత్రము. మామనసునందులేదు

ఉ॥ మేమును వారలుఁ గలసి మేదిని నేలుచు నుండుమీ తీర్తికెక్కెను
నాముదిసన్ముతంబు యదునందన యాకురువంశ మార్వగా
నాయకుఁడాసుయోధనుఁ డునై జనియించె నటంచులోకులుఁ
వేమరు మూరుచుండిరెక ఏలకునంతకు నీవు వారికిఁ.

ఆవాదుపోగొట్టుము. ఇదియే ప్రార్థన,

ఉ॥ పుట్టిననాటనుండి తనబుద్ధి దురోదరవృత్తి; తానుచే
పట్టినవారు నల్పులె; ధృవంబుగ భావము దైత్యభావమే;
పట్టినపట్టు తానువిడువంగల మంచిగుణంబు లేదిలన్
పుట్టసికిట్టివాఁడు మఱిఁబుట్టినఁ గిట్టునుగాక యుండునే!

కావున నీకుసాధ్యమైనంతవరకు సాధించి సంధియే యొ నర్చిరమ్ము.

కృష్ణ॥ వాయునందనా! నీవెన్నఁడును ఇట్టిపిరికి తనంబునకుఁ బాల్పడలేదు. నీవిపుడేటికిఁ సంధిజేయమని పల్కెదవు. యుద్ధంబు జేయవలసివచ్చునేమోయని యిట్లుఁ పిరికితనమువహించితి వాయేమి. నాకాశ్చర్యముగా నున్నయది.

చెప్పఁ దయూరసామృతము భీముఁడు గల్గు నోకానోక
సృష్టమూ॥

మాకు మాత్రము గల్గుఁ గాని వారికెంత మాత్రముఁ గలుగనేఱదు. ఒకవేళ వారికిఁ దోఁచకుండినను, వనుపంటి మహావీరులు కృధింప చవిటనేలను విత్తినట్లుఁ పగిది నిరుపయోగంబగు. వారికిఁ భయపడి మాత్రము సంధికిఁ బ్రయత్నించిన వారమని యెన్నకుము. ఈ భీమఫల్గునుల భుజాబలంబుల నీ వెఱుంగనివికావు.

గీ॥ బాహుమూలమునందున బ్రహ్మయుండు
బాహుమధ్యమున నీవెల్ల ప్రబలుచుండు
మఱి కరాగ్రమునందున హరుఁడు నిల్చు
మద్భుజంబులు సుమ్మివి యచ్యుతములు॥

కావున ఓముకుందా! మద్భుజపరాక్రమంబులకు నింక తిరుగేమి. మా పెద్దన్నగారి యాజ్ఞాబద్ధులమగుటచే పరాక్రమహీనులమనిపించుకొంటిమిగాని లేకున్నచో నీపాటి కెట్లుండునో యట్లుండు. ఇప్పుడైనను దాయాదుల వస మనస్కరింపవయే మిమ్ముఁ సంధికిఁ బంపుమార్గంబు విచారించుట. ధర్మమే జయమని, కదా పెద్దలును డువుట. కాబట్టి ధర్మమార్గమునే విచారింతమని మా తలంపు.

నకు॥ బావా! మాధవా!

గీ॥ నీకుఁ జెప్పంగ మేమెంత నేర్పరులము
నీకు నిష్టంబదెద్దియో మాకు నదియె

సాధ్యమైనంతవరకును సంధిఁజేయు
మావయినిఁ జేయుమే కార్యమైన దేవ॥

కృష్ణు॥ నకులా! నేనే కార్యమున కొప్పిన నీవాకార్యముఁ జేయఁ
గలవా.

నకు॥ బావా! మా పెద్దన్నగారి ధర్మమునకుఁలోబడి యుంటి
మి కాని మా పాండవ పంచకంబులో సంగ్రామరంగం
బున వెనుఁదీసి పారిపోవు వారెవ్వరో చెప్పుము. నీ
దయయే యుండవలె కాని యుద్ధంబున జయమునొందక
భయంబు నొందెదమా.

గీ॥ కాపురమును సూవె నియతి మా కాయమందు
దాపురము సూవె బలశౌర్య దర్పములును
శ్రీపదము సూవె పెద్దలసేవమాకు
కాన భయమేందుమాకునుఁ గలుగుకృష్ణ॥

నీవచ్చుటకేగి సాధ్యమైనంతవరకు సంధియే ప్రియత్నిం
ము. కాకున్నచో వారికాలకర్మ దోషమునకు నీవేమి చేయఁ
గలవు. మేమేమిఁజేయగలము. పోయిరమ్ము.

సహా॥ బావా! మహానుభావ!

సీ॥ దోసమెరింగి బల్ దోసంబు గలిగించి
ద్యూతమాడించిన పాతకుండు
దూరమైయున్న మాదారను సభకీడ్చి
వలువలూడ్చించిన మలినమూర్తి

పిన్నవాండ్రవలె విపినభూములకుఁ నమ్మఁ
బారఁదోలినయట్టి పాతకుండు
పెద్దలవాక్యంబుఁ బుద్ధినెంచక జ్ఞాతి
ధ్వంసనమున కొప్పు హింసకుండు

గీ॥ నైన యాసురయోధను పక్షమందునీవు
సంధిఁజేయంగ మదిలోన సంతసించి
యేగుచున్నావు సరేఁకాని యిప్పుఁడునాదు
యుల్లమున సంతసము లేదు నల్లనయ్య॥

మాతండ్రిగారు స్వర్గస్థుడైన మొదలు యిప్పటికి నీ భీమార్జున నకులసహదేవులమైన మేము నిరంతరము యీయ మానసయుని వాక్యపాశబద్ధులమై

ఉ॥ పెత్తనమిచ్చినాము; మఱిఁబెద్దగ నెంచిమెలంగినాము; తా
చిత్తము మీరక౯ విపిన సీమలలో నివసించినాము; మా
సత్తువలెల్ల మానియొక శైలము చాటునదాగినాము! మా
కుత్తుక లిచ్చినాము; తెసుకుందగు నచ్చినవారిచాట్పునన్॥

అయినను సామంబు నిరుపయోగం బగుటంజేసి యిప్పుడు మీరుఁ జెప్పినను మాయన్నగారు జెప్పినను యుద్ధంబున దుర్యోధనుం డీల్గువరకును సంధికెంతమాత్రము నామనం బొప్పదు. కావున బావా! సంగ్రామం బాచరించు తెఱంగూహించిరమ్ము ఇదియే నా ప్రార్థన.

కృష్ణు॥ (తనలో నవ్వుకొని) సహదేవా! నీవు పిన్నవాఁడవై
నను నీమాటలు భీమన్న పల్కులకు మిన్నగా
నున్నవి.

(కృష్ణుని సెలవుఁ గైకొని పాండవులు నిష్క్రమింతురు)

ద్రౌప॥ (ప్రవేశించి ముకుళితహస్త యుగ్మయై) కేశవా! పన
తార్తిపరాయణా! దానవకుల సంహారిణా!

కం॥ నావచనంబులఁ నించుక
భావంబుననుంచి సత్కృపామతితోడన్
నీవాలింపుము యీయెడ
దేవకిసుత! నీవుదక్క దిక్కెవ్వరికన్॥

మాధవా!

మ॥ కవవా నాటిదినంబునందు సభ నాకష్టంబు మషేక్కరవుల్
పినవాఁ పల్కినవాక్యముల్ కఠినముల్ ప్రేలంగ నచ్చో
[టఁ గాం
తనవాది ప్రముఖుల్ గనంగ కటివిస్త్రంబూడ్వ నిన్వేడగా
జనవా ప్రోవగ నన్ను నాతఱిని కృష్ణా! దేవకీనందనా॥

అప్పుడు, జగద్వీరులని ప్రసిద్ధిగాంచిన ధర్మభీమార్జున
నకుల సహదేవులు కుడ్యములకు స్థాపించిన చిత్రప్రతిమలవలె
నూఱకఁ జూచుచుండిరి. భీష్మద్రోణులు కూడ యామూఢా
త్ముని నివారింపకపోయిరిగదా. అన్నా! అప్పుడు మాంత్రి
మాసభలో

చ॥ "మగువలలోనసాధ్వి గడు మాటలు గొల్వన నిట్లునా [డగా
నగ" నని యావిశర్ణుఁడు సధర్మముగా వచియింప నంతనా
గతుఁడు కర్ణుఁడల్లిట సభాస్థలియందున దప్పిధర్మముల్
మగల ననేకమందిఁ గలమాని నీవిధినాడ దోసమా॥

అని నుడివెఁగదా.

సీ॥ ఇలయేలికలలోన విలసిల్లు మిపద భూ
జననాథునకుఁ గూతురనఁ బఱంగి
"యసమాన" బలులన యశముగాంచినపాండు
పంచకమును వరియించి తనరి
శ్రీమహాదేవి స్వాంతంబు రంజిల్ల
ఘనకీర్తి కోడలనఁగ నొప్పి
త్రిలోకంబున నెల్లస్త్రీజనంబులలోన
నిమణీయమైన గౌరవముగాంచి

గీ॥ పౌఢగాంచిన వారింట పట్టమహిషి
నై యదునాథ! నీ చెల్లెలైన నేను
గుడువగా తిండిలేకను బడఁగరాని
వనములందున నిడుములుఁబడితి నకట॥

అన్నా! కృష్ణా! నీ వెఱుఁగని సంగతు లేవియులేవు.
...నాలజ్జంతయుఁ బాఱద్రోలి చెప్పితిఁగాని యింకను
...వినుము

కాది పిృయాప్తులంచు సపుడప్పటిబోధవ మెంచితీవచాల్
శ్రీధవ! యింకనీకుగలచిత్త మదెట్టులో యాల్లె చేయవూ?

అన్నయ్యా! కృష్ణయ్యా! నాడెందంబుమాత్రి మా దు
ష్టాత్ముండగు దుశ్శాసనం డీల్గువరకు నానందంబొందదు. నీవు
నన్నా సుభద్రకంటె కడు గారాబంబున జూచుచుండెదవు.
ఇంతవరకు నీవే దిక్కని నమ్మియుంటిని. నాయందు దయ
గలవాడ వైతివేని యాధార్తరాష్ట్రిల పైని గృపఁ జూపకు
ము (అని పయ్యెదకొంగుతో కంట నీరు దుడుచుకొనుచుండ)
కృష్ణు॥ ద్రౌపదీ. నేనుండగా నీవు దుఃఖింప బనియేమి? నాకా
సుభద్రయొకటి నీవొకటి యా? (అని చేతులు రెండు
నుఁ బట్టికొని యోదార్చుచు)

గీ॥ ధార్తరాష్ట్రిలు చెనుతెతి దాపరించె
నెంత జెప్పినగాని రవ్వంతయైన
సంధికొప్పరు సమ్ము నిశ్చయముగాను
వేమునకుఁ బానః ముఁబొ యఁ దివముఁ జెడునె॥

కౌరవులు సంధికిచ్చగింతురను మాట కలలోనివారైర.
అస్మత్సహాయంబున నజాత శతృవి పంపున భీమఫల్గు
నుల యుద్ధంబునఁ బరిత్యక్త సంహారంబుఁ గావించి నీకు వే
లోనగూర్చును. కౌరవుల పుత్రికళత్రి రోదనము లాలకించు
కాలంబాసన్నంబైనది.

కం॥ నీపతులకు జయదాయక
మాపాదించినది యింక ననవరతంబుగ

నేపాలించెద నేయెడ
ద్రౌపది! నామాట నమ్ము తెప్పక మదిలోన॥

సోదరీ! నీవెప్పటివలెఁ జతుస్సముద్ర ముద్రిత ధరణీ చక్రమునకుఁ బట్టమహిషివై బఱఁగెదవు. ఇది సత్యంబని నమ్ముము. మనము లోకాపవాదము రాకుండగా సంధికి ప్రయత్నించిన వారమగుదుము. సోదరీ! ఇంక సెలవఁగుము నేను బోయివచ్చెద.

(అందరు నిష్క్రమింతురు.)





# పంచమాంకము.

## కౌరవుల తృతీయ రంగము.

సూ॥ సభ్యులారా! ఈదినంబున నందనందనుండు యమనందనుని కార్యార్థియై యిందు వేంచేయుచున్నవాడని ముందు సంజయునిచే వినియుంటిమి కదా.

సం॥ కౌరవేంద్రా! ఆయుపేంద్రుఁడు సాత్యకీసమేతంబుగా నదె వచ్చుచున్నాడు.

(అంతలో సాత్యకీ సమేతంబుగా కృష్ణుఁడుఁ గనుపడ)

కృష్ణ॥ కౌరవేంద్రా! శ్రీకృష్ణ భగవానులు వచ్చుచున్నవారు (అని చెప్ప ధృతరాష్ట్రుడు కొంచెమాలోచించి) శ్రీకృష్ణా!

ధృ॥ దీనదయాపరుండగు కృతాంతునిపుత్రుఁడు సేమమేఁకదా
మానిత విక్రమక్రముఁడు మారుతపుత్రుఁడు భద్రమేఁగదా
గోత్రమునిశిష్యుఁడస్త్రనిధి యాశ్రితగ్రిడికి శ్రేయమేఁగదా.
నులు మాద్రిపుత్రులును సాధ్వియు ద్రౌపది సౌఖ్యమేఁగదా.

కృష్ణ॥ కౌరవేంద్రా! వారక్షేమసమాచారములు నీవెఱుంగఁ గమున్నవి.

సీ॥ నీమూలమునఁగదా నిండుసభను నాఁడు
ద్యూతమాడియు రాజ్య దూరమగుట
నీమూలమునఁగదా నీకుమారులు వారి
యన్నపుట్టము విప్ప ఖిన్నులగుట
నీమూలమునఁగదా యా మహాటవులందుఁ
బదిరెండు వర్షముల్ పడిమెలఁగుట
నీమూలమునఁగదా నియతిఁదప్పక వార
లజ్ఞాతమున నెట్లో యణఁగియుంట
గీ॥ నీదుమూలంబుననఁగదా నిక్కువముగ
నిట్టి కష్టంబులకు వారుఁ గట్టువడుట
నాటికిప్పుడు వారికి నాటికమరె
క్షేమములు; బోయె నానాటి క్షామములును.

ధృత॥ శ్రీకృష్ణా! మహాత్మా! వారికీకష్టంబులు రావింప నన్ను మూలకారకునిగాఁ జేసితివా? కానిమ్ము.

ఉ॥ వచ్చిన నెట్టివారికపవాదము కీర్త్యపకీర్తులీధరన్
జచ్చినఁబోవునంచు బుధసంఘముఁబల్కుటనిశ్చయంబుగా
జెచ్చెర నింకనైనమఱిఁ జేసెద వీఁగు నందియుల్లముల్
వచ్చినవాదుఁబోవ; తరువాతను నాదగు వాంఛ యొట్టిదో.

కృష్ణ॥ కౌరవేశ్వర! ఎట్టులైన నీనింద నీవు బోఁగొట్టుకొనుము. మేలుఁబొందెదవు. ఇంక నేను విదురునింటికేగి సుఖం నేతెంచెద.

ధృత॥ మంచిది పోయిరమ్మా. (అంతి విదురునితో లేచి)

( తెఱ పడును. )

(విదుర మందిరము.)

విదు॥ దేవా! శ్రీకృష్ణా! భవత్పాదరజంబువలన మద్గృహం బు పావనమయ్యె. నేధన్యుడనైతి. పాండవేయులు సుఖముగ నున్నవారా!

కృష్ణ॥ విదురా! పాండవేయులొకప్పుడు సుఖముగ లేకుండిరా. కష్టసుఖములు శిష్టజనులకు సమానభాగములు. మనుష్యులకుమాత్రము వ్యతిరిక్త భాగములుగా నగుపడు చున్నట్లు గాన్పించు. (అంతలో కుంతి ప్రవేశించి)

కుంతి॥ నాయనా! కృష్ణా! (అని కౌగలించుకొని) నాకుమారులును కోడలును సుఖముగ నున్నవారా?

కృష్ణ॥ అమ్మా! అందఱు సుఖముగా నేయుండిరి.

కుంతి॥ నాయనా!

ఉ॥ అంతటివారి ధర్మమున నాప్తులుమెచ్చగ నభ్యవించియా
కుంతికి సౌఖ్యసంపదలు గూర్చిన దైవమునిమునుష్యయుగ
దింతటి కష్టసాధ్యములు చేర్చెను; నాకురునాథుజేసి వై
త్యాంత్యము! యింకమీదగను దారియు దొంకయు నిన్నుజూడగా

ములను పౌరుషహీనులన్నంత మాత్రముననే కారు. ఇకమీద నెవరెట్లుపల్కిరో వారికట్లేయొప్పగింతురు. ఇంక నే దుర్యోధనులకడకేగి మరలివచ్చెద. నీవీ విదురునియింటనే యుండుము.

(తెరపడును)

దుర్యోధన కర్ణుల ప్రవేశము.

కర్ణు॥ దుర్యోధన సార్వభౌమా! ఎవరోవచ్చుచున్నట్లున్నయది

ద్వారవాసి॥ దేవా! సుయోధన! చక్రవర్తీ! శ్రీకృష్ణభగవా నులుప్యకీవమేతముగాయ దేవచ్చుచున్నవారు

దుర్యో॥ కర్ణా! కొంచెమెదురు పోదముగులెమ్ము. [అంతలో కనుపడ చేయిపట్టుకొని] కృష్ణా! మీరాయిరువురిని పసిడిగ ద్దియల నలంకరింపుము.

గీ॥ దేవకీసుత! నీవిట్టిదినమునందు
ప్రీతిచే నీదు యనుజసమేతముగను
నాదుయింటను భుజియింపగా దలంచి
కోరియున్నా డనిను మదిగూర్చియుపుము

కృష్ణు॥ దుర్యోధనా!

కం॥ పార్థార్థి యింటగుడిచిన
సత్యముగా నమృతమైన, జవిచెడి విషమా

నే కోప మొందుచున్నాను
యోకృష్ణా! నీవు సంధియొనరింపుమంటివో॥

కాదని నాయనా,

కృష్ణు॥ దుర్యోధనుండు సంధి కొప్పుకొనఁడను మాటఁ దెలిసియే వచ్చినాడ. నాకు కురుపాండవులు సమానబంధువు లగుటచే ఆయుభయులు శ్రేయస్కాములగుటకు నాలోచించుచుంటిని. కావున నిప్పుడే కార్యభారము వహింపకుంటినేని,

గీ॥ "కౌరవులు పాండవేయులు, కదిమి దొరము
మహితశక్తిని సలుప నామాధవుండు
చూచుచు నెయుండె కొన్నాళ్లు చోద్యముగ" న
టంచులోకులు నిందింతు రమితముగను.

కాబట్టి నేనందువిషయమైవచ్చితి. ఇప్పుడు నాదగుశక్తినంతయు ధారపోసి సంధిప్రయత్నముఁజేసెద. వినరేని తత్ఫలం బనుభవింతురు.

విదు॥ చిత్తము. తమకుఁ జెప్పనేంతవాఁడను. తమకుఁ దెలియని దేమున్నది. ఇంకపోదము రండు.

(అంకము తెరదించబడును)

(ధృతరాష్ట్ర భీష్మద్రోణ సుయోధన కర్ణుల ప్రవేశము.)

ధృ॥ భీష్మద్రోణులారా! మన శ్రీకృష్ణుండు విదురునింటికేగి యింక నురాని కారణంబు తెలియదయ్యె,

(ద్వారపాలి.)

ధృతరాష్ట్ర మహారాజా! శ్రీకృష్ణభగవానులు సాత్యకి సహితులై సమీపంబుగా వచ్చుచున్నారు. (అని కేక వేయును.)

ధృ॥ భీష్మ ద్రోణులారా! ఆమాధవుని కెదురేగుదము లెండు. (అంతలో కృష్ణుడు గనుపింప) చేయిబట్టుకొని శ్రీకృష్ణా! ఈ మణిపీఠంబులపయిం గూర్చుండుడు.

కృష్ణు॥ ధృతరాష్ట్ర భూపతీ! నీవెఱుంగని ధర్మంబు లేవియు న లేవు. కాని, నేనిప్పుడీ భరతకులాభ్యుదయంబు గోరి యొకహితంబుఁ జెప్పవచ్చితి. అది యెట్లనిన,

క॥ క్షీరోదక న్యాయంబున
మీరును పాండవులును గలసి మెలసి చరింపన్
ధారుణి జనసంస్తుతులై
పూరించుడు మీకు యశము భూతలమెల్లన్॥

గీ॥ గాన వారిలమునఁ బెంచు కాలముననె
నెట్టులనుఁగాగ మంచితో యిపుడు నటులె
కాంచి మదినెంచి వారిభాగంబు బంచి
గౌరవము గాంచు మాచంద్రతారకముగ॥

ధృతరాష్ట్ర భూపతీ! పాండవులు మీకొమరులచే నెన్ని
బాధలు బెట్టబడినను మీచరణ సన్నిధినే, యుండ గోరుచున్న
వారు. కాబట్టి వారి పాలు వారికొసంగి మీపాలు మీరు
గైకొని సుఖభోగములు సుఖముగా వర్తిల్లుడు. ఇందుకు వారంగీక
రించియే యున్నవారు. మీరంగీకరింపరేని యుద్ధంబునకు
సిద్ధంబుగా నున్నవారు.

ధృత॥ కృష్ణా! దానవకుల సంహారిణా! నీపలుకులు నీతిదాయక
ములె. నిర్మల మానసముతో నాలించితి. నీవు
జెప్పినటులఁ జేయనైతిని గదా యని నీతో వచించుటకు
సంకటంబడుచున్నవాడ. నాకుమారుఁడగు దుర్యో
ధనునితో నేనెన్ని జెప్పినను వినడయ్యె. సంధి యను
మాటవిన్నంతనే చిందులు ద్రొక్కుచుండు. నేనేమిఁ
జేయువాడ. నాయఁడు దయయుంచి వాని చిత్తంబు
ప్రసన్నదంబునం బెట్టి భరత వంశమును నిల్పుము.

కృష్ణ॥ (దుర్యోధనుని వంకజూచి) దుర్యోధనా! త్రిజగత్ప్ర
ఖ్యాతిఁ గాంచిన యీ భరతకులంబునం బుట్టిననీకింత
మరాగ్రహంబు చెల్లునా? మీయుభయు లభ్యుదయం
బుగోరి నే వచించెడు వాక్యంబులు వినుము.

శా॥ ఉంచియు నుంచకో మదిని నోర్చితి; వారికొనర్చు నెగ్గు [లుఁ
డెంచక వారు లేవురు ఘ; బేదిఁ భంగిటు సంధి జేయఁగాఁ
బంచిరి; బంధుమిత్రులును బాగుపడంగను నీమనంబునం
దెంచెదొ? కూర్చెదో? కదన మేర్పడఁ జెప్పగదే సుయో- [ధనా॥

ఉ॥ కోపము దెట్టిదో మదిని గొంచెము తాఁగినవాఁడు కాఁడు ని
ష్కాపట చక్రపత్తిఁ బరిపూర్ణముగా నతఁ డగ్గెసేని [సం
తాపతి నేఁడు సంద్రములుఁ డాయును నొక్కట నిశ్చ [యంబుగా
నాపలుకుల్ గ్రహింపుము ఘనంబు సుయోధన కల్లు [సిక్కకున్॥

చ॥ సుమతులు పాండవుల్ మఱియు సోదరు లెన్నఁగ నీకు ము [ఖ్యులే
క్షమదను నుంచువా రితరశత్రుల కైనను నీకు నైన న
క్రమముగ నెగ్గొనర్పఁగను బొల్పదు వారును గారు [నెంచ స
క్రమముగ మీరు వారు నొక రాసిగ నుండిన లోక మొ [ప్పగున్

వారెన్నఁడును మీకు కీడుచేయఁ దలంచలేదు. అట్టి వారి నీరీతిగాఁ గాసిఁబఱుప న్యాయంబుగాదు. మీ యుభయు

లున( గలసి మెలసి యుంటిరేని సకల రాజన్యులు వినీతులై గొల్తురు. ఇదియునుంగాక,

గీ॥ పాండవుల సురాసురులైన భండనమున
నెదురుకొనఁజాలగాలేరు; మందమతితోడ
నిన్ను గోరియు వచ్చిన నృపతులెల్లఁ
జచ్చుటయు నిశ్చయంబని చాలనమ్ము॥

దుర్యోధనా? గురుభీష్మాదులుఁ కూడ సంధిజేసికొనుటయే యుచితంబని నొక్కి వక్కాణించుచున్నవారు. ఇప్పుడు మీతండ్రిగారు జెప్పిన చొప్పున సంధికొప్పి సుఖంబుగా వర్ధిల్లుము. ఇదియే నా సమ్మతంబు.

దుర్యో॥ కృష్ణా!

మ॥ గురుభీష్మాదులు దూరుచుండు రిపుమర్మ కార్యరాతుల్ దంచుచు నను
మరితుండంచును లోకులాడెదరుగా దూష్యంబు లెన్నొ ని
న్నిదియంగా మఱి పన్నె నాదెదవుగా యీ పాండవుల్ పక్షమై
మఱియున్నారయ వైరివింక నిడుముల్ మాయందు సంస్కారివై॥

కృష్ణా! వారి యిష్టానుసారంబుగా నరణ్యవాసంబునకుం బోయిరిగదా! అందువిషయమై మాదేమున్నది? ఆ పాండవులు మామీఁకి కాలు ద్రవ్వుట ధర్మరాజు తన మనోభీష్టప్రకారంబుగా జూదంబునకొప్పి రాజ్య సంపదలెల్ల నోడిపోయె. అప్పుడు వారిపై దయయుంచి మఱల నాటినెల్ల వారి కొసంగితిమిగదా? పిదప రెండవసారి జూదంబున మఱల నోడిపోయి పండ్రెండు వత్సరంబు లరణ్యవాసంబును నొక్కయేడజ్ఞాతంబును సలుప నొడంబడి విధివశంబున నోడిపోయిరి. అందు మా తప్పేమున్నది. వారిని జూదమాడు మన్నది యెవరు? రాజ్యమోడుమన్నది యెవరు? ఓడిన వారికి రాజ్యమెక్కడిది? ఎట్లు రాజ్యమిచ్చెదము?

సీ॥ రమణీయమైన యీరాచకులమున బు
ట్టి రాధేయుడు పేరు వడసి
క్షితిపాలురెల్లఁ గొలిచియుండఁగా
రాజ్యకార్యభారంబు బూనించి
ఘోరరణంబుగా భూచక్రము నేను
నేక చక్రంబుగా నేలుచుంటి
నేను నా పాండవులాడఁగ లోఁబడి
సంధిఁ గోరెద నింకఁ జెప్పనేల

గీ॥ భండనమ్మున మద్గదాదండమునను
శత్రువీరుల బరమార్చి శమనపురికి
బంపెద నే నీ వాడచే బడితి నేని
వీర స్వర్గంబు బొందెద వెక్కుడేల॥

సాత్య॥ (వెలుపలుండి గ్రహించి)

కం॥ అన్నా! కృష్ణా! నీయెడ
బన్నిన దుష్కార్యములను బాగుగ వినుమా!
నిన్నిపుడుఁ గట్టివేసిన
బన్నగములు కోఅలూడ బఱికిన భంగిణ్॥

పాండవులు చిక్కుదురని, దుర్యోధన కర్ణులు ద్యూము వెలుపల రహస్యముగా జెప్పకొను చున్నవారు. (అని సాత్య కిచెప్ప అప్పుడు గురుభీష్మవిదురాదులు నొకరివంక నొకరు జూచుకొనుచు భయాకులిత చిత్తులై యుండ)

ధృత॥ (భీతితో) కటకటా! ఈజగద్రక్షకుని కేమియొద్దు. నే యుదుర్యోగదా. (అని బిగ్గఱగా, దుర్యోధనా ఇటు రమ్ము.

దుర్యో॥ (కర్ణునితోఁ బ్రవేశింప)

ధృత॥ కం॥ ఎవింతటి దుష్కార్యము
గావింపగ జెల్లదకట! కంసాంతకు ప్ర
సిద్ధేవుడనని నృపునని
భావింపగ దగదు! గాదు పరువు కుమారా॥

కృష్ణ॥ (దుర్యోధను వంకఁజూచి) వేసవి కాలపు భాస్కరునివలె మండుచు గలయూచి) దుర్యోధనా! ఈకృష్ణుఁ

యీ ధరాచక్రమున కు భూనాథుని గను
చేసెదను నిన్ను పాండవార్చితుని గాఁగ॥

ఇంతయేగాక ఆద్రౌపది నిన్నారవ భర్తగాఁ జేకొనును.
కావున నామాటలవినుము.

కర్ణు॥ బావా! మాధవా. ఈసంగతి నేనిదివఱకే నా [illegible]
కవచకుండలంబు లింద్రున కిచ్చునాఁడే సూర్యునిచే
కర్ణాకర్ణికముగ వినియున్నను. ఇప్పుడు స్పష్టముగా
నీచే దెలపఁబడెను,

సీ॥ భావింప పదమూఁడు వత్సరముల్ నేసింపు
నా సుయోధనుఁడేలె నవనిచక్ర
మేకచక్రంబుగా నేలికఁ గావున
లేదిక సుఖములమీఁద నాశ
దీరెఁ గాకున్నను దేవ! విను ధర్మ
తనయుఁడే ధరనేలఁ దగినవాఁడు
స్పష్టంబుగాను నీకిష్టుండనై దెల్పె
దను విను తథ్యంబు ధార్తరాష్ట్రు
గీ॥ లను జయింతురు సౌఖ్యంబు లనుభవింతురు
భూజనంబులు గొల్తురు బుధులు బొగడ
నీదు దయచేతనే వారు నిక్కువముగ
ధర్మరాజేలు నికమీఁద ధరణిఁ గృష్ణ!

ఇదియునుంగాక.

మ॥ ఖగరాడ్వాహన! కుంతినన్నుగనితా గంగానదిన్ బట్టిచో
యుగ సూతుండును గాంచిపెంచె నవురా! యాసూతపు
[త్రుండనన్
నగరీగా కృపుడేను నీదు బలుకుల్ నిక్కంబుగా నమ్మినన్
నగరే లోకులు చక్రవర్తి యనినన్ నన్నేల బాధించెరా॥

సీ॥ దలప నమ్మెంచు ధార్తరాష్ట్రుల ఋణంబు
నెట్లుదీర్చెద బతికింపు మిదియుగాక
రాజరాజన్న నన్ను నవ్యాజమైన
కటిని నరసెడు తనదు సోదరునిగాక॥

కాబట్టి దుర్యోధనచక్రవర్తి యాయర్ధుని నీరణంబున కర్ణుండు నిర్జించు గదాయని నమ్మికొని కయ్యంబున కియ్యకొని యున్నవాడు. తరువాతవిధికృతంబెట్లుగానున్నను నా దుర్యోధను కోరికనెట్లు దప్పించుదు. కావా!

గీ॥ ఆయజాతశత్రుడు సోమయాజిగాగ
ద్రౌపదీదేవియును సోమిదమ్మగాగ
నేను చతురాననుజులును ఋత్విజులుగాగ
ననర నచ్చోట నీ వుపద్రష్టగాను॥

వర్తింప, కురుకుమార పశుయజ్ఞంబు,గాక మానునా! దానంజేసి పవిత్ర స్థలంబగు నా కురుక్షేత్రంబున కయ్యంబున జయించినన జయింపక పోయినను స్వర్గపురంబున కేగుదురు.

కాన నీవు నాకు పరమహితంబు గోరి వచించినట్లిది చేయఁజాలనైతిఁ గదా! అందుల కెంతయో చింతించుచుంటి.

కృష్ణు॥ బావా! కర్ణా పాండవులు నిక్కువముగా రాజ్యసంపదలు బొందఁదగరని నొక్కివక్కాణించుచున్నాడవు. నీవిదివఱకా సుయోధనునితో సజ్జనుని యుద్ధంబున నిర్జించెదవని పలికియున్నావు. ఇదియంతయు నీకుఁ దెలిసియే చేయు స్వామిద్రోహ మన్నమాట

కర్ణు॥ బావా! మహానుభావా! ఇదివఱకు తెలిసి పలుకుట కాదు. ఇప్పుడు నీ దివ్యరూపము జూచిన మొదలు నాకట్లు దోఁచినయది. కృష్ణా! ఇక నాకు సెలవిమ్ము. (అని చేతులు బట్టుకొని) బావా! ఈ రహస్యము మాత్రమా యజాతశత్రునకు నెఱింగింపకుము ఇదియే నా ప్రార్థన.

(అంతలో ద్వారపాలిక ప్రవేశముగా)

శ్రీకృష్ణదేవా తమరు కర్ణునితో ముచ్చటించుచున్నారని కుంతీమహాదేవి ద్వారముముందు నిలిచియున్నయది.

కర్ణు॥ ఆమహాదేవిని లోపలికిఁ బ్రవేశింప బ్రార్థించుచున్నవాడ.

(అంత కుంతి లోపలికిఁ బ్రవేశింప)

కర్ణు॥ (ఆసనంబుడిగ్గి) తల్లీ! క్షత్రియవనితా! ఈ యాసనంబు నలంకరింపుఁడు.

(అంతఁ గుంతి యాసనంబుపై గూర్చుండియుండ కర్ణుడు కేలుమోడ్చి)

గీ॥ ప్రిబలు నీకున్న గొడ్రాలివమ్మ!
గాంచి నీటను ద్రోచిన కలుషివమ్మ!
కులవిహీనుని జేసిన కుపితవమ్మ.
తలచి యోర్పునాకుఁ గొనుము నా దండమమ్మ.

కుంతి॥ (కౌగలించుకొని) తండ్రీ! కర్ణా! అట్టి దుర్మార్గురాల నేకాని, నా విన్నపము గొంచెమాలింపుము. నేనుచిన్నతనంబున దుర్వాస మహాముని యుపదేశించిన మంత్రంబు

కం॥ పరిశీలించుటకై యా
తరణిని మదిఁగాంచి మిగుల ధ్యానమొనర్పన్
కరుణించి యొసగె నిన్నా
పరనిందకు జంకి నీటఁ బడద్రోచితి నుగా॥

తండ్రీ! నీకు సహజ కవచకుండలంబులుండుటచే నీతండ్రికంటె పదినూర్ల రెట్లు ద్యుతిగల వాఁడవై వెలుంగుచున్న

నిన్ను గంగలో ద్రోసినట్టి దుర్మార్గురాలనే కాబట్టి నా నేరంబులు మన్నించక నీయనుజులతో గలిసి సుఖముగా చక్రమ్ము నేలుకొమ్ము' (గగనమం దాకాశవాణి)

ఆకా॥ నిజము! కుంతీపుత్రా! నిజము. నీవు 'కుంతికి జనించిన మాటయే నిజము. సర్వలోక ప్రశంసనీయుండవై కురుక్షేత్ర సంగ్రామంబు మానిపించి ధర్మజాదుల చేతం బులు ప్రీతిం జెంద సింహాసన మధిష్టించి రాజ్యపాలనము చేయుము.

కర్ణ॥ తల్లీ! కుంతీమహాదేవి! మొదట నాభాస్కరుని వల్లను పిదప శ్రీకృష్ణుని వల్లను యిప్పుడీ యాకాశవాణివల్లను నేను కుంతీనందనుండనను వాక్యంబు దేటపడెనుగదా! అయినను తల్లీ! పదునారు వర్షంబులు కాటికిగుడ్డకై పరవారి కొంపలనుండి అట్టి దుఃఖంబులను నెలుపలించక నూటివిగానిసీవెన్నడైన నిట్టిసంగతి తెలిసి పిలిపితివా? తల్లీ! ఇప్పుడు నాసుఖంబు గోరి చెప్ప వచ్చితివి అయినను తల్లీ! కల్పకవల్లీ! ఇదివరకు పాండవులు చేకొంచిన మాట దప్పించి పాండవపక్షమున జేరి యొప్పుచుట నాకుచితంబుగాదు. ఇదియుంగాక.

గీ॥ ఎట్టి కష్టంబులను నాకుఁ బెట్టకతఁడు
యెపుడు నామంచిగోరు నా నృపతి కాంచి

తల్లి దండ్రిలు తనయులు దమ్ములైన
భూరితులుఁ గారు! నమ్ము మవ్వారిగాగ॥

కుంతి॥ తండ్రి! కుమారా! పాండవ పంచకంబను మాట తప్పిం
చి నాకుచితంబు గాదంటివే. సరిగనే. అతీరునసే నాకు
వరమిమ్ము

కర్ణు॥ తల్లీ! పాండుమహిషీ! నీయిష్టంబొసంగితి. ఇంక నాకార్య
మునఁ గూడెఁగదా! నీవఱుగుము. తల్లీ! ఒకవేళ పాండ
వులు యుద్ధంబున నాచేత జిక్కరేని పార్థునిదప్ప మతె
వ్వరిని జంప. ఒకవేళ నేనేవానిచేతం జిక్క మడిసినను
వారైదుగురుందురు. కాక నాచే యాతడు దెగటారిన
నాతో నైదుగురుందుము!

కుంతి॥ (తనలో) ఈతనికా పార్థుడు యుద్ధమందు జిక్కువా
డు కాడు. (తనలో యనుకొని) గాంధేయులపై
కూడ కరుణయుంచుము.

కర్ణు॥ తల్లీ! పాండవమధ్యముని దప్ప దక్కినవారిపై నీయభీ
ష్టము కొలందినడచెద. తల్లీ! ఇక నాకు సెలవిమ్ము.
పోయివచ్చెద. (అంత కర్ణుఁడు నిష్క్రమించును)

కృష్ణు॥ (కుంతి చేతులుఁబట్టుకొని) అత్తా! ఇంక నాకు సెల
విమ్ము నేనుఁబోయి వచ్చెద.

ధర్మ॥ (తమ్ములవంక జూచి) భీమసేనా! కౌరవ సభయందు గలిగిన విధమంతయు శ్రీకృష్ణుని వలన వింటిమి. ఇంక ననుమానాస్పదంబేమియు లేదు.

(కృష్ణునివంక జూచి) కృష్ణా!

ఉ॥ కౌరవవంశ మూర్పగను కాలును ద్రిప్పుచు నా సుయోధ
నుం
డే రణమందు దానుఅక నేత్రగ జూసినవాడు న
య్యామిం
కౌరయ డయ్యె నా మదియు నాతని యాతనివా రినార్ప
గా.
గోగకనంటె నింక నౌనగూడదు కూఁమిపొందు భాగ్య
మూర్ణ॥

కృష్ణా! నా మనోభీష్టంబును భీమార్జున నకుల సహదేవుల చిత్తంబును నీ వెఱుంగుదు. ఆ కౌరవశ్రేణి దంపుసం గురు భీష్మ విదురాదుల శుభిపాయంబును గూడ గ్రహించి వచ్చితివి. కావున నిష్పక్షమున ధర్మమెయ్యదియో విచారించి మాకొక మార్గంబు దెల్పుము.

కృష్ణ॥ బావా! యుధిష్ఠిర! ఎన్ని విధంబుల విచారించినను సంధి యొనగూడకుండె. కావున యుద్ధంబు జేయుటే ధర్మమార్గంబని నా తలంపు. ఇదియునుంగాక గురుభీష్మ

విదుర శాస్త్రులును, మీతల్లియగు కుంతీమహాదేవియు కౌరవులాడిన బలుకులు విని యుద్ధమే నిశ్చయమని నీతో దెల్పుమని నాతో వచించిరి.

(అప్పుడు భీమార్జున నకుల సహదేవులు అన్న మొగమువంక జూడ)

ధర్మ॥ తమ్ములారా! కౌరవులు పెట్టిన నెతలు జ్ఞప్తికప్పుడప్పుడు వచ్చుచున్నను బంధుమిత్రుల వధించుటకు నా మనసొప్పకున్నయది. కావున మీరు ధర్మవర్తన మెయ్యది యో విచారింపుడు.

అర్జు॥ అన్నా! ధర్మరాజా!

గీ॥ ధర్మవర్తనమును మేము దలచి జేయ
నెంతవారము గురు భీష్మ కుంతివిదుర
కృష్ణులకుమిన్న ధర్మంబు తెలుగగలరె?
వారునడచినమార్గంబె దారిమనకు.

కావున నీవు విచారింపబని లేదు.

భీ॥ అన్నా! ధర్మనందనా!

కం॥ ఎందఱు జెప్పిన విన డీ
సందేహముబడకునీవు సాధింతుము మే

ష్ట్రాదులు రాష్ట్రపు జనులును
మాతల్లియు కుంతిదేవి మఱి గాంధారుల్॥

కృష్ణు॥ సూనృతశే చ కుశాలి సమాజా! యుధిష్ఠిర మహా రాజా! అందఱికి శుభంబె

ధర్మ॥ బావా! శ్రీకృష్ణదేవా! ఆదుర్యోధనునితో నేమి వచించితివి? మఱలాతడు నీతో నేమివచించె?

కృష్ణు॥ పోరాటంబు మానుమని యెన్నియో ధర్మమార్గంబులు వచించితిగాని యవియెల్ల చెవిటివానిముందు శంఖమూదిన చందంబున నిష్ఫలమయ్యె. పై పెచ్చు అపహాసె.

సాత్య॥ బావా! ధర్మరాజా! అపహాసించుటే గాదు.

గీ॥ అమితబలుబులు దుర్మార్గులా సుయోధ
నాదు లత్యంత కపటంబు లఱసి కృష్ణుఁ
గట్టివేయఁగ దలచిరిగాని యపుడు
విశ్వరూపంబు దాల్చగా వెఱచి దిగిరి॥

ధర్మ॥ బావా! అంతపనయ్యెగా! అతని తండ్రిగాని గురు భీష్మ విదురాదులుగాని యింత పెద్దలెవరున లేరా యట?

కృష్ణు॥ బావా! ధర్మరాజా.

కం॥ ఆ ధృతరాష్ట్రుడు నెన్నియొ
బోధించెనుగాని చవిటిభూమిని విత్తు

పాదించిన విధ మయ్యెను
ఔరా ధర్మజ! ఏమి యీ సుయోధను బలుకుల్॥

మఱియు గురు భీష్మ విదురాదులు నింక నచటి పెద్దలు ననేకవిధమ్ముల పాండవుల పాలియొక పోయినట్లయిన మీరు చెడుదురని రాజాభిమానంబేమియు లేకుండనే ధర్మంబే పలికిరి. ఆపలుకులు కఠినంబులుగా దోచి సభ విడిచి తనతమ్ముల తోడను కర్ణునితోడను వెడలిపోయె. పిదప గాంధారి పిలిపించి యెన్నియో ధర్మంబులు నుడివె గాని.

గీ॥ ఎవ్వ రేమేమి పలికిన నవ్వి యతడు
చెవినిబెట్టక కలిగున్న శ్రేణినెల్ల
చేరబిలుచు నా కురుక్షేత్రమునకు
సముఖమునకు చెప్పి పంపియున్నా డవినుము॥

భీష్ముని సేనాముఖునిగా జేసె. అప్పుడు నేను సామదండోపాయంబులఁ జూచితి. నారదాది మహామునులను రావించి దుర్యోధనునకు బుద్ధి వచ్చునటుల జెప్పించితి. కాని, నేనెంత బోధించినను సంధివిషయమున కాసింతైనను సందివ్వకపోయె. పాపాత్ముండు రాజ్యంబు నేలువాడుకాడు. ఇక కౌరవుల యెడ దండనంబు దక్క నొండుపాయంబు లేదు. కావున నిక మీయిష్టంబు కొలంది యుద్ధంబు తెఱంగాలోచింపుడు.

ంతి। అయ్యా! కృష్ణయ్యా! ఈవృత్తాంతమంతయు నాక్కా[illegible] తుని పుత్రునకు చెప్పెదవా?

కృష్ణు। మంచిది. అలాగుననే చెప్పెద. ఇంక బోయి వచ్చెద.

(అందరు నిష్క్రమింతురు.)





# షష్ఠమాంకము.

## ౧

(పాండవుల తృతీయ రంగము.)

(ధర్మ భీమార్జున నకుల సహదేవుల ప్రవేశము.)

ధర్మ॥ భీమసేన! నిన్నటిదినంబున మన శ్రీకృష్ణదేవుండు హాస్తినాపురంబు విడిచి వచ్చుచున్నాడను సంగతి విని యుంటిమిగదా! ఈదినంబుననే రానగు తెలియుంబడి యున్నయది.

(అంతలో సాత్యకి ప్రవేశింప)

అర్జు॥ (దిగ్గున లేచి) శ్రీకృష్ణదేవుండేడి? సాత్యకీ! అదిగో వచ్చుచున్నవారు.

ధర్మ॥ మనమందర మా మహనీయున కెదురేగుదము లెండు
(అందరు ముందునకు నడువ కృష్ణుడు గనుపడ)

ధర్మ॥ (కృష్ణుని కౌగలించుకొని) కృష్ణా! నీదర్శనంబు లేకపోవుటచే మాకెంతయో దారిద్ర్యంబు సంభవించి నట్లుండె

సీ॥ మోదంబా గురు కృప భీ
ష్మాదులు విదురుడును మాదుజనకుడు ధృతరా

మందబలమును గలసియు కురు
ఈసంకటంబు మాని మునుదిలోఁ.

కావున శ్రీకృష్ణునికంటె ధర్మజ్ఞులెవరు? ఏమిజెప్పినచో
ప్పునదే మనము నడుచుకొందము. కష్టములెవ్వియును గాని
రవు.

సహా॥ అన్నా! పెద్దన్నా! యిదివఱకు వచ్చినకష్టంబు కంటె
నిప్పుడెక్కువ కష్టంబులు గానున్నవా?

(కృష్ణుని వంకజూచి)

ఉ॥ వారికి కాలముఁ దఱిగి వచ్చియెనీవున పెద్దలెందఱో
చేరిసుధర్మముల్ మతివచించిన గని యు ంధిగూర్పగా
నేరరు మృత్యుదేవతయు నిక్కన గూర్పసియము డ
[వారి నే
తీరు నసంధిఁ గొప్పదరు? దల్వియు లేకన గముల వారికిఁ
గోజులులేక నే యాతడు పట్టినపట్టు విడువకుండుట.

(అప్పుడు కృష్ణుడు నవ్వుకొనుచుండ)

నకు॥ బావా! నవ్వెద వేమి? ఈ సహదేవుని వాక్యంబులకు
సందియమేమున్నది.

భీము॥ బావా! మాధవా! మనమెంత ప్రయత్నము జేసినను దైవకృతంబును దప్పింపలేముగదా! కాన మనము యుద్ధయాత్ర నాలోచింతములెమ్ము.

(అందరు నిష్క్రమించుచున్నారు.)

—♦ భరతవాక్యము. ♦—

తే॥ రాజులు రాజ్యభాగమున నంతులుమాని చరింత్రుగాకని
ర్వ్యాజతవైరముల్ జెనిచి న్యాయవిధుల్ పిడకుంద్రుగాక; యీ
భూజను లెల్లకాలమును పూజ్యులమాటలు విందురుగాక వి
ద్యాజయకీర్తులీశ్వరుడు తామరతింపరగానొసంగుతన్॥

సంపూర్ణము.

ఈ పుస్తకములు వలయువారు:—

[illegible] నామాల వీరప్ప

పెదవడ్లపూడి, (పోస్టు)

గుంటూరుజిల్లా,

అని వ్రాయవలయును.

